జూలై, 1959

# జయంతి

9

సంపుటము 1 సంచిక 9

ఈ సంచికలో

ఆధునిక సాహిత్యగతిని సూచించే

*హిందీ మాసపత్రిక :*

# 'కల్పన'

[redacted] తులు

కథలు

సాహిత్య విమర్శలు

ఆధునిక సాహిత్య సమస్యలపై

విశేష చర్చలు.

కార్యాలయము :

౩౧౬౬, సుల్తాన్ బజార్

హైదరాబాద్.



**PROCEEDINGS OF THE DIRECTOR OF PUBLIC INSTRUCTION, ANDHRA PRADESH.**

R. C. No. 973 M 4/58. Dated 8—6—59.

The following Telugu monthly is commended for use in all the Libraries of Schools, Colleges and public Libraries in the State.

Name : JAYANTI

K. RAGHAVA REDDY,
*For Director of Public Instruction.*



'జయంతి' రైల్వేస్టేషనులలోని 'హిగిన్‌బాథమ్స్' పుస్తకశాలలలో దొరుకును.

# జయంతి

# 9



జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.

సంపాదకమండలి :

విశ్వనాథ సత్యనారాయణ
(అధ్యక్షులు)

మల్లంపల్లి సోమశేఖరశర్మ

దివాకర్ల వేంకటావధాని

కేతవరపు రామకోటిశాస్త్రి

జువ్వాడి గౌతమరావు

సంవత్సర చందా 8-0

విడిప్రతి 75 న. పై.

# సంపాదకీయము

కార్డినల్ న్యూమన్ ఇంగ్లీషుభాషలో సారస్వతముమీద నొకవ్యాసమును వ్రాసెను. అందులో భాషాంతరీకరణములను గురించి కొన్ని[illegible]లైన విషయములను విలిఖించెను. ఒకభాషలో నొక మహాగ్రంథమున్నచో దానినింకొక భాషలోనికిమార్చుట యథార్థముగా నసంభవమైన విషయము. 'కళ్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మే. ఏతి జీవంత మానన్దో నరం వర్షశతై రపి' అన్న వాల్మీకిమహర్షి శ్లోకమున్నది. ఇది పరమ రమణీయమైన శ్లోకము. వాల్మీకి మహర్షి యొక్క వాగమృత ధారలలో నొకటి. ఈ శ్లోకము నింకొక భాషలోనికి మార్చుట యెట్లు? ఇందలి యర్థము తీసికొని చెప్పినచో నది భాషాంతరీకరణ మగునా? అచట కల్యాణీ, లౌకికీ అన్న రెండుశబ్దములు తీసివేసినచో శ్లోకముయొక్క పూర్వార్థమునందలి రామణీయకము నశించును. కాదు, ఆ రెండు మాటలను తెచ్చి తెలుగుపద్యములో పెట్టుదము. అంతటితో కుదిరినదా? గాథా - ఇయమ్ దీనిని తెలుగులోనికి పెట్టుటకు వీలులేదు. బత, ప్రతిభాతి ఈ రెండు మాటలు రానేరావు. వచ్చినను ఆ వృత్తము తెలుగులో లేదు. ఉన్నను ఆ భాషలో ఆ భావమునకు ఆ మాటలతో ఆ వృత్తమునకు గల సంబంధముచేత నే యనంత రామణీయకము కలిగినదో, నది యెంతచేసినను మరియొక భాషలో వచ్చుట యసంభవము. ఏతిజీవన్త మానందః, అన్న వాక్యములోగల సౌందర్యము పూర్వమునందు వలె నీశబ్దము నాశ్రయించి యున్నదనుటకు వీలులేదు. ఆ మూడుమాటలు ఆ పద్యములో నాల్గవ వంతును పాలించుకొంచు విలక్షణమైన వాక్యముగా కన్పించుచున్నవి. మరియు నా శ్లోకములో సగమైన తరువాత రెండవసగములోతొలిసగముగా నీ వాక్యమునకున్నస్థానము సౌందర్యభూమిలో తొలగించరాని యొక విలక్షణమైన స్థానముగా కన్పించుచున్నది. జీవన్త మానన్దఏతి, ఆనన్దో జీవన్తమేతి. ఏత్యానందో జీవన్తమ్; ఈ మూడు వాక్యములుగూడ నదేయర్థము నిచ్చును. మరియొకచోట రమ్యముగా కన్పించవచ్చును. ఇచ్చట మాత్రముకాదు. ఈ మూడు మాటల కదేవరుస. ఆశ్లోకములో స్థానమదియే. ఆ మాటలను తీసివేసి మరియొక మాటలను పెట్టుటకు వీలులేదు. జీవన్తం అనుటకు ప్రాణినమ్ అనినచో ఏతి యనుటకు గచ్ఛతి అనినచో నేమియు లాభములేదు.

ఇంత వ్రాయుట ఎందుకనగా నీశ్లోకములో నున్న భావము మరియేవిధముగా చెప్పినను సంస్కృత భాషలోననే దానికి సౌందర్యము కొరవడుచుండగా నింకొక భాషలో దీనిని చెప్పుటను గూర్చి చెప్పవలయునా? ఈ శ్లోకము యొక్క సౌందర్య మెం దిమిడియున్నది? సీతాదేవి యాంజనేయునివలన శ్రీరామచంద్రుని వార్త విన్నది. ఇది యామె యనినమాట. ఆమెయొక్క యానందములో తన్మయత పొందిన వాల్మీకిమహర్షి యొక్క మనస్సు లేదా యాత్మ సంస్కృతభాషలోఆ వృత్తముగా, ఆ మాటలుగా, ఆ మాట లావరుసలో నా రీతి వచ్చుటగా నావిర్భవించినది. దానికది యొక్కటే రూపము. ఆ స్థితి, ఆస్థితిలో జానకీదేవి, అప్పటి జానకీదేవితో నవినాభావము పొందిన వాల్మీకి, ఆయనమనస్సు, ఆయన పాండిత్యము, ఆయన కవితావేగము, ఆ సంస్కృతము, ఆ వృత్తము, ఆమాటలు, ఇవియన్నియు నానుషంగికముగా ప్రసరించిన ప్రసరణ మాశ్లోకము.

సాహిత్యమనగా నిది. ఇంకొకటి కానేరదు. దానికి రూపాంతరములేదు. భాషాంతరములేదు. లేదనుటకు నన్నియు సాక్ష్యములే. భారతదేశమున పలు దేశభాషలుకలవు. అన్నిటికి సంస్కృతముతల్లి. సంస్కృతమునందున్న మహాగ్రంథములన్నియు ప్రతి దేశ భాష లోనికి వందలుగా భాషాంతరీ

కరణము జరిగినవి. దేనికిని నిలుకడలేదు. ఒక్క మేఘసందేశము తీసికొన్నచో—తెనుగులో దాని కెన్ని వేల యాంధ్రీకరణములు గలవో చెప్పలేము. ఆ గ్రంథమును తొలుత చదివినవాడు వానికి గణములు కూర్పగల వ్యాధియున్నచో దానిని తన మాతృభాషలోనికి ననువదించుటకు ప్రయత్నించనివా డనుచు నుండడు. ఆ యాంధ్రీకృతులలో నేది నిలువవలయును. ఏదియును నిలువలేదు. నిలువదు. ఎందుచేత? ఒక మహాకవిఒకభాషలో పుట్టును. వానికిగల యావేశమునకు, తత్కథకు, వానిభాషకు వాని నోటివెంటనప్పుడు వచ్చిన యావృత్తమునకు, ఆ వృత్తములో నప్పుడొదిగిన యా శబ్దములకు నంతయవినాభావసంబంధము. అభాష తనకువచ్చి అపద్య మున్నట్లుగా చదివి తా నానందించవలసినదే కాని మరియొక విధముగా తాదృశానందము లభించుటకు వీలులేదు. మరియొక భాషలో నొక విలక్షణమైన పద్యరచనా సౌందర్య సంపాదన శీలమైన భాషా భావములు కలవాడు ఆపద్యము లను భాషాంతరీకరించును. భాషాంతరీకరణము రమ్యముగా నున్నదని యందుము. రమ్యముగా నున్నది భాషాంతరీకరణముగాదు. వా డా భావమును మరి యా భాషలో చెప్పినస్థితి. ఆ పూర్వ పద్యములోనున్న భావ మీ పద్యములో నుండుట జరిగినది. నన్నయ్య తిక్కనలు, పోతన్నగారు—వారి గ్రంథములు భాషాంతరీకరణములుగావు. ఎందుచేత ననగా తద్వస్తువుతో వారి తన్మయీభవనము, వారి యావేశము, తదావేశసంజనితమైన యాంధ్ర భాషాపద్యసమావిర్భావము, ఇదియంతయు వేఱు. వారు మహాకవులగుట ఈ లక్షణము వలన.

ఎందుకనగా భావములు సర్వసామాన్యములు. 'త ఏవ పదవిన్యాసాః త ఏవార్థవిభూతయః' అవే పదములు, అవే అర్థములు. 'లౌకికమైన శుభమైన, యీ కథ నాకు విన్పించుచున్నది. బ్రతికియున్నచో వందయేండ్లకైనను ఆనందమును బొందును.' ఈ భావములో క్రొత్త యేమున్నది? ఏ భాషలోనైన నెవ్వడైన నెప్పుడైన నిది చెప్పవచ్చును. దానికి సంస్కృతభాషలో నా శ్లోకము కుదిరినట్లు మరి యొకచో కుదురదు. "ఆ యెలనాగ నీకుదగు నంగనకుం దగు దీవు మాయుపాధ్యాయుల యాన పెండ్లియగు తప్పదు జాడ్యములేల" అన్న పద్యములో రుక్మిణీ శ్రీకృష్ణదేవులకు సరిగా తగిపోయిన లక్షణము నగ్నద్యోతనుడన్న బ్రాహ్మణు డెట్లు జూచెగ, వారి దాంపత్య మెట్లు సరిపోవునో, నా వాక్కున కా యర్థమట్లు సరిపోవును. అట్లు సరిపోనిది జాడ్యము. జడత్వము. వ్యాధి. చైతన్యము కాదు. సౌందర్యము కాదు.

ఇది మహాకవివాక్కు కాగా ఇంక భాషాంతరీకరణ మన్న ప్రసక్తిలేదు. ఉన్నచో నది జాడ్యము. లోకమునందు జాడ్యము లేకుండ నుండునా? ఇది పలువిధములుగా నుండును. కడచిన రెండు వందల యేండ్లుగా షేక్స్పియర్ నాటకములు తెలుగులోకి చేసినవారు వందలుగలరు. ఒక్కటి మిగులలేదు. ఇంగ్లీషుభాషలో షేక్స్పియరు పరమేశ్వరుడు. తెలుగుభాషలో పరమేశ్వరుడైన వా డొకడు వాని నాటకము నొకదానిని తెలుగులోనికి జేయును. అది నిలువవచ్చును. అది నిలుచుటకు తెలుగుభాషలో వానికున్న పరమేశ్వరత్వము చాలదు. మూలభాషకు, నీ భాషాంతరమునకు సత్త్వమునందు సమానలక్షణము లుండవలయును. మరి యింకెన్నియో యుండవలయును. అన్నియు నున్నవి గనుక, మరియు నా కవియొక్క పరమేశ్వరత్వమున్నది గనుక తెలుగులో భారత భాగవతము లున్నవి. తక్కిన మహాకావ్యము లన్నియు వందలకొలది తెలుగుసేతలున్నను లేవు.

ఒక్కొక్కప్పుడు మూలగ్రంథ మల్పగుణభూయిష్ఠము, భాషాంతరీకరణ మధికగుణవంతము. కారణము వాడల్పకవి. వీడధికకవి. వా డా భాషయం దల్పకవి. వీ డీ భాషయం దధికకవి. కవి యనగా విలక్షణమైన గ్రథన కౌశలము కలవాడు.

ఇట్టివి వందలకొలది భేదములు కలిగియున్న ఈ భాషాంతరీకరణ క్రియాసముదాయమునందు యాథార్థ్య పరిజ్ఞానము లేనిచో లోకములో నన్ని విషయములందువలె దీనియందుఁ గూడ లౌకికమైన కౌటిల్యము, దుస్తంత్రము సాగించవచ్చును. తెలుగులో వాఁడు కవియౌనో కాదో యెవ్వరికిని తెలియదు. ఇంగ్లీషుభాషలో కొంత రచనాశక్తి గల యొకడు అల్పిష్ఠమైన యీ తెలుగు కావ్యమును కొంత శక్తిమంతమైన ఇంగ్లీషు భాషలోనికి లేదా హిందీభాషలోనికి తర్జుమాచేసి వాడు గొప్ప కవియని ప్రచారము చేయుట కలదు. కొంత కవితాశక్తి యున్నచో నింగ్లీషు హిందీభాషల యందు తర్జుమాచేసినవాని కున్నది. తెలుగులో మూలమునందు లేదు. నేడిది పలుచోట్ల జరుగుచున్నది. ఒకనిపద్య మొక డింగ్లీషులోనో, హిందీలోనో, చక్కనిభాషలో వ్రాయును. తెలుగులో నా పద్యమునకు స్థలములేదు. ఆ కవి కవిశబ్దవాచ్యుడే కాడు. ఈ దుస్తంత్రము నేఁడు సాగుచున్నది. మాతృభాషయం దల్పుడైన కవి పరభాషలయందు కొంత పటిష్ఠతగలిగిన తర్జుమాదారుల వశమున పరసీమలందు గొప్ప కవిగా చెప్పబడుచున్నాడు. తెలుగునందు సముత్కృష్టుడైనకవి తక్కువవాడుగా భాసించుచున్నాడు.

ఈ తర్జుమాలలో మరియొకదోష మున్నది. మూలమునందున్న భావము వేరు. తర్జుమాలందున్న భావము వేరు. ఒక భాషలోనున్న భావము సరిగానట్లే చెప్పుటకు రెండవ భాషలో పొసగదు. ఆ రెండవ భాషలోనున్న యొక సుందరమైన నుడికారమునో, పలుకుబడినో సమాశ్రయించి చెప్పుదురు. అపుడు మూలములోలేని సౌందర్యము భాషాంతరీకరణములో నుండును. ప్రతిష్ఠ మాత్ర మీ సౌందర్య విరహితమైన మూలమునకు వచ్చుచున్నది. మహాకవి యైన టాగూరు ప్రతిష్ఠ యిట్టిదని కొందరందురు. అది యెంతవరకు నిజమో తెలియదు.

ఉమర్ ఖయ్యామ్ పద్యములను ఫిట్జ్ గెరాల్డ్ ఇంగ్లీషులోనికి చేసినాడు. ఆ యింగ్లీషు నేత మూడుసారులు మార్చినాడు. అనగానేమి? తన యింగ్లీషు వాక్యము తన యింగ్లీషు పద్యములో నా భావమధికాధిక సుందరముగా నుండుటకు ప్రయత్నము చేసెనని యర్థము. అర్థములును భావములును ఎప్పటికప్పుడు భేదించుచునే యుండును. ఆయన వ్రాసిన గ్రంథమునకు ఉమర్ ఖయ్యాము యొక్క మూల గ్రంథమునకు సంబంధమే లేదని విషయము తెలిసిన వానికి తెలియును. హైదరాబాదులో నిజాము ప్రభుత్వ మున్నప్పుడు ఆర్థిక శాఖలోని యొక యుద్యోగి, ఉమర్ ఖయామ్ యొక్క మూల గ్రంథమైన సుమారు రెండువేల పద్యముల నింగ్లీషులోనికి తర్జుమాచేసి ప్రకటించెను. అది నిజాం ప్రభువున కంకితమీయఁబడెను. ఆ గ్రంథమును దగ్గర పెట్టుకొని ఫిట్ గెరాల్డ్ గ్రంథము చదివినచో రహస్యము తెలియును. ఇదియొక పరకాయ ప్రవేశ విద్య.

అందుచేత భాషాంతరీకరణము మానవలయునా? అని చెప్పెడివాడెవడు? చెప్పినచో చేసెడివాడెవడు?

మన శాస్త్రము లేమి చెప్పుచున్నవనగా అర్థ కామములు రెండున్నవి. ధర్మముతో ననుసంధించి చేయవలయునని చెప్పుచున్నవి. అట్లే మాతృభాషలో నిజముగా నుత్తములైన కవిని వీలైనంత వరకు యథామాతృకముగా భాషాంతరీకరించి పెరలకు చూపుట ధర్మానుబంధియైన యర్థ కామములను పాలించుట వంటిది.

# దిగి రా! | బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

ఓసి వినీల మేఘమ! మృదూహ సుధారము మాన్య మా వియ
ద్వాసము నీకు నేటికి? ముదాస్పద మస్తమహో గిరీంద్రమో,
హాసవికాసిసౌధశిఖరాగ్రమొ, త్వత్పరిరంభణార్హమే!
ఆ సరసాకృతిన్ మరుధరాంతర వృష్టిగ చేసికొందువే?

మనమున కోటితారకల మంజిమ నాస యొనర్తువా అదే
వనమున కోటి పుష్పతరువారము కద్దు కవుంగిలింపవే!
కను లరమోడ్పుచేసి శిలకై వడి ప్రాబడియున్న ఆ వియ
ద్వినమిత మూర్తికై రసవతీ! వితజేతువె జీవనాపగల్?

పూవులు మెచ్చువారికడ పూవుల యొప్పిదముల్; కసాయికిన్
గోవును గార్దభమ్ము నొక కోవకె చెందు; రసప్రశస్త ధా
రా వర వర్షిణీ! హృదయరాజిత వైద్యుత దివ్యవల్లరీ!
ప్రావృష సత్కృపాఖని! భవజ్జని తత్త్వము సుంత పోల్పవే!

నీలాకాశ మహాంబురాశి విహరన్నీలాభ్ర నౌకా! భవ
ద్వేలాపార దురంతయాత్ర కిక స్వస్తిన్ పాడవే! నీ వృథా
లీలస్వాప్నిక వల్లికల్ విరియబో వేనాడు; నీ పోడిమిన్
కాలోగ్రాహికి కాన్కవెట్టకు రసాగారా! నినున్ మ్రొక్కెదన్!!

నిజమే వ్యోమ విశాలబాహువులలో నీవెన్ని నాకమ్ము లే
ని జవిన్ జూడగవచ్చు; ఉద్గతముకంటెన్ హృద్గతప్రాభవ
మ్ము జగా నిగ్గులునించుగాని, సజలాంభోదా! భవజ్జీవన
స్రజపున్ సౌరు సతమ్మె? ఏల గగనాశాసౌధ నిర్మాణముల్?

హృదయాంతస్థ్సు రసావగాహ సుఖలాభేచ్ఛన్ నినున్ వేడువా
రి దయావార్యభిషిక్తులన్ సలుప; వా వృద్ధాత్మ నూరేగ జా
చెద; వాషాఢ వినీల వారిద! భవచ్చిత్తస్థ చాంచల్యముల్
ప్రిదులన్ నీ స్తనితమ్ములో నభయ మీవే నీ సుహృత్పాళికిన్!

వార్షుక వాకిషక్రతు వివర్ధిత ధూమమువోని మేనితో
హర్ష నవాశ్రు దర్శన పదావృత రమ్యజడత్వలీలతో
కర్షకపాళి స్వాప్నిక జగత్పరివర్తిత సత్యతాప్రభన్
వర్షరమాసితేక్షణమ! వ్రాలి వసుంధర నేలికొమ్మికన్!

వర్షాంగనా మనోహర
శీర్షానమితాలకా విశీర్ణస్రక్సం
ఘర్షోత్థ తటిత్పాళీ!
హర్షానమకేళి! రసహృదాళీ! దిగిరా!

# అభిజ్ఞాన శాకుంతలము 9

విశ్వనాథ సత్యనారాయణ

"కావ్యేషునాటకం రమ్యం నాటకేషు శకుంతలా
తత్రాపిచ చతుర్థోంకః తత్ర శ్లోక చతుష్టయమ్"

అన్న యభియుక్తోక్తి గలదు. శాకుంతలమును గూర్చి యిట్టి శ్లోకములు పెక్కు గలవు. మరియు 'నుపమా కాళిదాసస్య' మొదలైన చాటూక్తు లెన్నో కలవు. ఆంగ్లేయ విద్యావేత్తలు తిరిగి తిరిగి జర్మన్ కవి గెథే చెప్పిన 'శాకుంతలము స్వర్గమర్త్యములకు ముడి' అను నర్థము గల వాక్యముల నుదాహరించుచుందురు. ఎంతమందికైనను కావ్యమును పఠించుట యనగా మధురమైన శబ్దసంయోజనమును పర్యాలోచించుటయు, ఉక్తివైచిత్ర్యమును పరిశీలించుటయు, ఉపమాద్యలంకారరమణీయతాపరామర్శ చేయుటయు, ప్రకృతివర్ణనము, పాత్రపోషణము తత్కాల విషయ పరిగ్రహణము మొదలైన విషయములను సమాలోచించుట తోడనే సరిపోవుచున్నది. నిజానికి పైన చెప్పిన విషయములన్నియు లేకుండ నుత్తమ కవిత్వము లేదు.

శాకుంతల విషయమున వీని యన్నింటికి మించిన మహావిషయము కలదు. పైన చెప్పిన విషయములలో కొన్నియును శ్లోకగత బహ్వర్థ్వములును పర్యాలోచించి మొదట చెప్పిన శ్లోకము చతుర్థాంకమునకు, అందలి నాల్గు శ్లోకములకు ప్రాధాన్య మిచ్చినది. లోతునకుదిగి విచారించినచో శాకుంతలమునకు కిరీటాయమానమైనది పంచమాంకము. ఇందలి రచనను దాటి సృష్టిలో నే కవియును చేయలేడు. సాధ్యము కాదు. ఏలననగా దీనికి వెనుకటి వ్యాసమున నిరూపింపబడిన దుష్యంతుని స్వరూపము పంచమాంకమునందే పండియున్నది. అతని యంతఃకరణ జాగ్రత్త కథ కొదిగింపబడినది. శాపముచేత దెబ్బదిన్న సగము నిద్రపోని యంతఃకరణము, రెండును జంట ప్రవాహములవలె పంచమాంకమునందే ప్రవహించుచున్నవి.

అంకారంభమునందే హంసపదిక సంగీతముతో నీ విషయము ప్రారంభింపబడినది. ఆ గీతిక విని రాజు 'అహో రాగ పరివాహినీ గీతిః' అనుచున్నాడు. స్థూలదృష్టికి రాగశబ్దముచేత సంగీతరాగ మని యనిపించును. మరికొంత విచారించినచో శ్లేషశక్తి చేత హంసపదికయొక్క ప్రేమయని యర్థ మిచ్చుచున్నది. మఱియు నధికముగ హంసపదికా దుష్యంతోభయగతరాగాభివ్యక్తి నీ గీతిక చేయుచున్నదని యూహింపవచ్చును. రాజు చిరునవ్వు నవ్వి ఇట్లనుచున్నాడు. 'సకృత్కృత ప్రణయోఽయం జనః। తదస్మాదేవం వసుమతీ మన్తరేణ మ దుపాలంభ మవగతోఽస్మి। సఖేమాధవ్య। మద్వచనా దుచ్యతాం హంసపదికా। నిపుణ ముపాలబ్ధోస్మీతి।' ఈమెతో నా కొకనాటి పరిచయము గలదు. వసుమతినిగూర్చి యీ గీతితో న న్నుపాలంభించుచున్నది. మిత్రుడా! హంసపదికతో నేను చెప్పితినని, నేర్పుగా నుపాలంభించె నన్నానని చెప్పుము.

హంసపదికయందు రాజునకు ప్రేమ పోలేదు. కృతప్రణయమైన జనమునం దాతడెప్పుడు విరాదరణ వహించడు. అందుచేత హంసపదికా దుష్యంతోభయగత రాగ మని చెప్పినది. అట్లు, కబురు పంపించెననగా 'విన్ను మరచిపోలేదు. మరల నెప్పుడో నిన్నుఁ జూతు'నని వ్యంగ్యము ఈ సన్నివేశమునందే పంచమాంకకథయంతయు

సప్తమాంకములోని శకుంతలా సంయోగముతోపాటు సూచితమగుచున్నది. 'రాగ పరివాహినీ గీతిః' అన్న మాటలోని 'రాగ' శబ్దము హంసపదికాగతమైన యనురాగమేకాదు. తరువాత వచ్చు 'రమ్యాణి వీక్ష్య' మొదలైన పద్యములలో సూచింపబడిన జ్ఞాపకము రాని, అవ్యక్తమైన, జీవగతమైన, అంతఃకరణ నిష్ఠమైన, రాగముకూడ నభివ్యజ్యమానమగుచున్నది.

'సకృత్కృతప్రణయోఽ యం జనః' అన్న మాటలో శకుంతలాలక్షణమున్నది. ఆమెయు సకృత్కృత ప్రణయయే. హంసపదిక శకుంతలా స్థానీయురాలుగా గల్పింపబడినది. 'నిపుణ ముపాలబ్ధోఽస్మి' లో నీ యంకాంతమునందు శకుంతల చేసిన "క ఇదానీ మన్యోధర్మ కంచుక ప్రవేశినః తృణచ్ఛన్న కూపోప మస్య తవానుకృతిం ప్రతిపత్స్యతే" అను నుపాలంభములోని నిపుణత్వము సూచితమగుచున్నది.

విదూషకుడు 'గృహీతస్య తయా పరకీయైర్హస్తైః శిఖండకే అప్సరోభిరివ వీతరాగస్య నాస్తి మే మోక్షః' అన్నాడు. ఆమె ఇతరులచేత నా జుట్టు పట్టుకొని లాగించును. వీతరాగుడైనవానికి అప్సరసలచేతవలె నాకు మోక్షములేదు. ఇవి మాఢవ్యుని మాటలు. కొంచెము శాఖాచంక్రమణమైనను, విదూషకుని స్వరూపమిచట ప్రస్తావింతును. పూర్వ వ్యాసముల యందు దుష్యంతుని సత్పురుష లక్షణము తెలిసిన వారిలో విదూషకుఁడు ప్రధానముగాఁ జెప్పబడినది. మాఢవ్యుడు కొన్ని సంస్కృత నాటకములయందు వలె మూఢుడుగాడు. ప్రగల్భుడుగాడు. అతడు మహా వివేకి. ఎంత వివేకియనగా షష్ఠాంకమందు ప్రత్యభిజ్ఞ కలిగినతరువాత రాజు మిక్కిలి దైన్య మవలంబించగా ఉన్మాదస్థితిని బొందుచుండగా తదున్మాదస్థితిని తెలిసికొన్నవాడై రాజుయొక్క యున్మాదమును పరిహసించుటకు రాజునందు హాస్యరసమును గల్గించినాడు. రాజు రసాలకిసలయములనుఁ జూచి యున్మత్తుడుగాగా తాను కఱ్ఱనెత్తి యా చివురాకులను కొట్టబోయినాడు. దానితో రాజునకు నవ్వు వచ్చినది. ఉన్మాదము చెడినది. ఈ విదూషకుడు సర్వథా రాజ రక్షణ తత్పరుడు. 'లంఘిత ఏష భూయోపి శకుంతలా వ్యాధినా నజానే కథం చికిత్సితవ్యో భవిష్యతీతి' అన్నంత ఆదుర్దా పడగలవాడు. మఱియును శకుంతలాచిత్రదర్శన సమయమున ఇతడు నవ్వి మనస్సులో నిట్లనుకొనును. 'ఏష ఇదానీ మున్మత్తః। అహ మప్యేతస్య సంసర్గేణ ఈదృశోస్మి సంవృత్తః' 'ఇతడిప్పు డున్మత్తుడైనాడు. ఇతని సంసర్గముచేత నేనును పిచ్చివాడనై పోవుచున్నాను.'

అచ్చట అప్సరసలచేత గ్రహింపబడిన వీతరాగునకు మోక్షము లేదనుటచేత, ఇచ్చట నేనుగూడ పిచ్చివాడనై పోవుచున్నాననుటచేత రాజుయొక్క జాగ్రద్భూతాంతఃకరణావస్థాపరిజ్ఞాత యగుటచేత విదూషకుడు మహా వివేకి, వీతరాగుడుగా తెలియబడుచున్నాడు. మరియు రాజుయొక్క యున్మాదము పరిహరించుటకు హాస్యక్రియాజటిలుడగుటచేత, రసభావపరిజ్ఞాత యగుచున్నాడు.

రాజు 'సఖే సర్వ మిదానీం స్మరామి శకుంతలాయాః ప్రథమ వృత్తాన్తమ్ కథితవా నస్మి భవతేచ। స భవాన్ ప్రత్యాదేశ వేలాయాం మత్సమీప ముపగతో నాసీత్ । పూర్వ మపి న త్వయా కదాచిత్సు కథాసు సంకీర్తితం తత్ర భవత్యానామ్। కి మహ మివ విస్మృతవా నసి త్వ మపి' 'సఖుడా! శకుంతలా ప్రథమ వృత్తాంతము సర్వము నాకిపుడు జ్ఞాపకము వచ్చినది. నీతో చెప్పినాను. ఆమె ప్రత్యాదేశసమయమునందు మీరు లేరు. పూర్వమెప్పుడు నీవు ఆమె పేరైన నెత్తలేదు. నావలె నీవుకూడ మఱచిపోయితివా? అన్నాడు.

రాజు ఇచ్చట రెండుచోట్ల భవచ్ఛబ్దము వాడినాడు. రెండుచోట్ల త్వచ్ఛబ్దము వాడినాడు. త్వచ్ఛబ్దము పరిచయాధిక్యమును సూచించును. భవచ్ఛబ్దము పరిచయముతో గూడిన గౌరవమును సూచించును. విదూషకుడన్నచో రాజునకు ప్రేమయేగాదు. చాల గౌరవము కలదు. అప్పుడు విదూషకు డిట్లన్నాడు. న 'విస్మరామి' కింతు సర్వం కథయిత్వా అవసానే త్వయా పరిహాస విజల్ప ఏషః, న భూతార్థ ఇత్యాఖ్యాతమ్. మయాపి మృత్పిండ బుద్ధినా తథైవ

గృహీతమ్। అథవా భవితవ్యతా బలవతీ।' నేను మరచిపోను. కాని నీవు పరిహాస విజల్పమన్నావు. మృత్పిండబుద్ధివి నేనట్లే గ్రహించినాను. కానిచో భవితవ్యత బలవతిగదా. ఇవి యతడన్న మాటలు. 'నేను మఱచిపోను' అనుటచేత విదూషకుడు తాను తెలివి తక్కువ వాడననుకొనువాడుకాడు. మృత్పిండబుద్ధి యను మాట స్వోపాలంభనముగాని వాని మనోలక్షణము గాదు. మరియును రాజుతో, అట్టి దుఃఖగతునితో భవితవ్యత బలవతి అనదగినవాడెంతవాడు? ఏదో అనవలయునుగాని దైవ మపరిహార్య మనదగినవాడు సమానుడు. తన మనోదార్ఢ్య మపతలి వానికి తెలిసి చరించువాడు.

మరియును రాజునకు తీవ్రకోపము రావలయుననగా మాఢవ్యుని బాధించవలయునని మాతలి యనుకొనెను. మాఢవ్యుడనగా రాజునకంత గౌరవము. అంత ప్రేమ. ఇది దేవతలకుకూడ తెలిసిన విషయము. ఆతడు పట్టి నర్మసచివుడుగాడు. సర్వథా రాజువద్ద నుండువాడుగాడు. అతనికిష్టము వచ్చినచో నుండును. ఇష్టము లేనిచో నుండడు. పట్టి నర్మ సచివుడైనచో ప్రథమాంకమునం దుండితీరవలయును. తృతీయాంకమునం దుండితీరవలయును. ప్రత్యాదేశ సమయమునందుకూడ నుండవలయును. ఇది కొంత విదూషకుని వృత్తాంతము.

ఇతనిఁగూర్చి మరియొకమాట. రాజతనితో, "సఖే త్వమమ్బాభిః పుత్ర ఇతి ప్రతిగృహీతః స భవానితః ప్రతి నివృత్య తపస్వి కార్యవ్యగ్రతాం నివేద్య తత్ర భవతీనాం పుత్రకృత్య మనుష్ఠాతు మర్హసి."

చెలికాడా! అమ్మగారు నిన్ను కొడుకువలెనే చూచును. నీవు తిరిగివెళ్ళి యీ ఋషుల పనిచెప్పి, వారికి నేనెట్లో అట్లు చేయుటకు తగుదువు అన్నాడు. దీనిఁబట్టి విదూషకుడు వెకిలివాడుకాడు. విదూషకుడు వివేకియని, పరమ యోగ్యుడని, సముదాచారవేత్తయని రాజమాతకు దెలియును. అంతేకాదు. అతడంత మర్యాదతో, అధికారముతో బ్రవర్తింపగలడని రాజునకు దెలియును.

నాటకము జాగ్రత్తగా జదివినచో, లోకము చక్కగా దెలిసినచో నొక విషయము తెలియగలదు. ఇద్దరు స్నేహితు లుందురు. ఇద్దరును మర్యాదస్థులు. వ్యవహారములయందు పరస్పర గౌరవము చెడకుండ మాటాడుకొనుచుందురు. నడుమనడుమ నొక్కొక్కసారి స్నేహ గాఢత్వమును పురస్కరించుకొని 'ఏరా, ఏరా' యని హాస్యమాడుకొందురు. దుష్యంతమాఢవ్యుల పరిస్థితి యిది. ఇద్దరును మర్యాదగా మాటాడుచు విదూషకుడేదియో కొంటెమాట యనును. రాజును హాస్యముగనే సమాధానము చెప్పును.

అందుకనియే అప్పుడు విదూషకుడు 'నేను రాక్షసు లన్నచో భయపడుచున్నా ననుకొంటివేమి?' అని చమత్కారి మాడినాడు. రాజు దానికి 'ఎబ్బె, నీ విషయములో నట్లనుకొనుటయే' అని పరాచిక మాడినాడు.

పై విషయ మందుకొన్నచో హంసపదికాగీతము శకుంతలాతిసంధానమునకు చూళికాప్రాయముగా నిక్షేపింపబడినది. అపుడు రాజు "కిన్ను ఖలు గీత మేవంవిధార్థమాకర్ణ్య ఇష్టజన విరహాదృతేపి బలవదుత్కంఠితోస్మి" ఇట్టి యర్థము గల పాటను విని ఇష్టజన విరహము లేకుండగనే మిక్కిలి యావేగమును పొందుచున్నా నేమి? అనుకొనెను. ఇష్టజన విరహము లేదు. హంసపదిక ఇష్టజనము కాదా. హంసపదిక వసుమతి నుద్దేశించి యీ పాట పాడినది. వసుమతి యెవరు? రాజుయొక్క పట్టమహిషియా? అయినచో హంసపదిక అట్లనలేదు. కానువచ్చును. "కమలవసతి మాత్ర నిర్వృతః" అన్న మాటచేత పట్టమహిషి కూడ గావచ్చును. కాదా! వసుమతి యనగా భూదేవియు గూడ గావచ్చును. ఎవరైననేమి? ప్రస్తుతము రాజున కామె యిష్టజనము. రాజుయొక్క కోరిక యామెయం దున్నది. శకుంతల యందు లేదు. శకుంతల విస్మృతి పథమునందు పడి

పోయినది అన్న విషయము 'ఇష్టజన విరహా ద్రుతేపి' అన్న మాటలోఁ దెలిసిపోయినది. సరే దానితో కథ తువిగిపోయినది. కాని 'బలవదుత్కంఠి తోస్మి' అన్నాడు. కథావిషయికమైన యాశాంకుర మేర్పడినది. రాజు శకుంతలను మరచిపోయినాడు. కాని యీ పాటను వినుటచే నతనిలో నొక గగ్గోలు బయలుదేరినది. ఈ గగ్గోలు సామాజికులయందు మునిగిపోవుచున్న రసభావములను సముద్ధరించు చున్నది. వెంటనే రాజు నే నెవరినైనను మరచి పోయితినా? అన్న యూహ చేసినచో సామాజికుని యొక్క రసభావము మఱల బ్రతికెడిది. రాజట్లనక 'రమ్యాణి వీక్ష్య' మొదలైన పద్యములచేత హేత్వంతరము కల్పించి కథ మునుగకుండ తేల కుండ నట్టిపెట్టినాడు.

ఈ రీతిగా మునిగిపోవుచున్న కథను, రసమును కాళిదాసు 'రమ్యాణివీక్ష్య' అన్న శ్లోకములో సముద్ధరించినాడు. ఈ శ్లోకము రససిద్ధాంతమునకు మహా భాష్యమువంటిది. రసస్వరూప మంతయు దీనియం దున్నది. దీని రహస్యమును అభినవగుప్త పాదుఁడు నాట్యశాస్త్రమున, రససూత్ర వ్యాఖ్యాన సందర్భమున నిట్లు వ్యాఖ్యానించినాడు.

"వస్తు సతాం కావ్యార్పితానాంచ దేశకాల ప్రమాత్రా దీనాం నియమహేతూనాం అన్యోన్య ప్రతిబంధబలాత్ అత్యంత మపసరణే సఏవ సాధారణీ భావః సుతరాం పుష్యతి। అత ఏవ సర్వసామాజికానాం ఏక ఘనత ఇవ ప్రతిపత్తేః సుతరాం పరిపోషాయ సర్వేషాం అనాదివాసనా చిత్రీకృతచేతసాం వాసనా సంవాదాత్। సా చ అవిఘ్నా సంవిత్ :"

వస్తురూపముగా దేశము, కాలము, ప్రమాత అనగా గ్రహీత— వీరు కావ్యమునం దర్పింపబడుదురు. ఇవి నియమహేతువులు. అవి యొకదానికొకటి ప్రతిబంధ హేతువులు. అవి పూర్తిగా తొలగినపుడు సాధారణీ భావము పోషింపబడును. అందుచేత సర్వసామాజికు లకు ఏకఘనత ప్రాప్తించును. అందరి చేతస్సులు అనాదివాసనచేత చిత్రీకృతము లగును. అదియే అవిఘ్నమైన సంవిత్తు.

సామాజిక హృదయములయందు కాళిదాసు హంసపదికా, వసుమతీ, శకుంతలాది సర్వనాయికా భావాపసర్పణము దుష్యంత భావాపసర్పణము, తద్దేశ కాలాపసర్పణము చేసి విస్మృతిపాత్రమైన మన స్సును తొలగించి చిరంతనమైన యీ సంవిత్తు, అంతఃకరణ నిష్ఠమైనది, జీవసహజమైనది, 'రసో వై సః' అన్నదానికి లక్ష్యమైనది—ఆ సంవిత్తును సామాజికులయందు నెలకొల్పినాడు. అచట నా సంవి జ్జ్యోతి వెలుగుచుండగా, అది ప్రధాన రసస్వరూప మగుచుండగా రసభంగమెట్లు వచ్చును? కథాభంగ మెట్లు గలుగును? ఇదియే చమత్కారము. ఈ చమ త్కార స్వభావము మనసాధ్యవసాయము గాని, సంకల్పము గాని, స్మృతిగాని కావచ్చును. అని యభినవగుప్తుడు. ఇచ్చటనే ఆయన ఈ శ్లోకము నుదాహరించుచున్నాడు.

రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి య త్సుఖితోపి జంతుః
త చ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని. ఇత్యాది.

అత్ర స్మరతీతి యా స్మృతిరుపదర్శితా, సా నతార్కిక ప్రసిద్ధా : పూర్వ మేత స్యార్థస్యా నను భూతత్వాత్। అపితు, ప్రతిభానాపరపర్యాయ సాక్షాత్కారస్య భావేయ మితి। సర్వతాఏవ ఏషాస్తి ప్రతీతిః ఆస్వా దాత్మా యస్యాం రతిరేవభాతి। తతఏవ విశేషాంత రానుప హితత్వాత్ సా రసనీయాసతీ న లౌకికీ, న మిధ్యా, న అనిర్వాచ్యా, న లౌకికతుల్యా, న తదారోపాది రూపా :"

రమ్యములైన వానిని చూచి, మధురములైన శబ్ద ములను విని సుఖితుడైనవాడు గూడ పర్యుత్సుకు డగుచున్నాడు. ఇది యేది యగుననగా నది యిది. భావస్థిరములైన జననాంతర సౌహృదములైన వానిని, పూర్వము తెలిసికొనని వానిని నిశ్చయముగా మనస్సుతో స్మరించుచున్నాడు—మొదలైనది. ఇచ్చట

'స్మరించుచున్నాడు' అని ఏది స్మృతిరూపముగా చూపింపబడినదో అది తార్కిక ప్రసిద్ధము గాదు. ఈ విషయము పూర్వ మనుభవములో లేదు గనుక. మరి యేమనవలయును? ప్రతిభాన మున్నది. ప్రతిభాన మనగా సాక్షాత్కార స్వభావ సంబంధమైన విషయము. అది యిచ్చట నున్నదని యర్థము. ఇది యెట్టిది? ఇది ఆస్వాదాత్మయైన ప్రతీతి. దీనియందు రతి భాసించును. (దీనిని కొంచెము వివరింతును. ప్రతీతి యనగా నొకవిధముగా స్ఫురణ యని చెప్పవచ్చును. 'ఇ' గతౌ అన్నధాతువుమీద తిప్ ప్రత్యయము చేర్చి ప్రతి యన్న ఉపసర్గ కలుపబడినది. తాత్పర్యముగా దానినిగూర్చి గమనము. దేనినిగూర్చి? ఆ తెలిసికోవలయునన్నది. దానినిగూర్చి. అది తెలియబడినది. దానిపేరు ప్రతీతి. దానియందు రతియున్నది. రతి యనగా రమణము. అందుచేతనది యాస్వాదాత్మ. తరువాతి మాటలవలన దీని స్వరూపము మరియు నవగతమగును.) ఈ ప్రతీతి, ఈ రతిస్థానము, ఈ చమత్కారము, విశేషాంతరమును వాంఛించదు. అదియే రసనీయ. ఇది లౌకికమైనది కాదు. దేశకాలాద్యవచ్ఛిన్నమైనది గనుక ఇది మిధ్యకాదు. దానియందు భ్రాంతిలేదు గనుక. ఇది అనిర్వాచ్యము కాదు అనుభవింప బడుచున్నది. పొందిన యనుభవము తరువాత చెప్పబడు చున్నది. రసస్వరూపము ప్రపంచింపబడినదిగనుక. ఒకానొక లౌకికభావముతో నిది సమానమైనది కాదు. లౌకికభావము ఆస్వాదాత్మకాదు. అనగా మనః పరిధులను దాటిపోదు. ఇంద్రియ సన్నికర్షమును పరిహరించలేదు. మరియును ఇది తదారోపాదిరూప కాదు. అనగా నీ యనుభవమునందు రసాద్యారోపము జరుగలేదు. అచ్చమైన పదార్థము పదార్థముగా ననుభవింపబడినది.

ఈ శ్లోకమునందు కాళిదాసు రసము యొక్క పరమ స్వరూపమును నిక్షేపించినాడు. ఏ చమత్కారము, ఏ ప్రతీతి, ఏ ప్రతిభానము తనయందు రతి నిమిడ్చుకొని జీవలక్షణము కలదై యంతఃకరణ రూపమున భాసించుచున్నదో, ఏది రసశబ్దార్థమునకు పర్యాయభూతమైనదో ఆ స్థితికి నీ పద్యము వ్యాఖ్యానము. ఈ పద్యములో మూడు విషయము లున్నవి. సుఖితుడు— అతని కింకొకదాని యందు వాంఛలేదు. రెండవది పర్యుత్సుకుడు.— ఈపర్యుత్సుకత్వము వాంఛాలక్షణము. వాంఛ కలదు. మూడు. ఈ రెంటిని సంయోజనపరచు వస్తువు మూడవది. అది స్మరణ. స్మరణ యనినంతనే తార్కికముగా పూర్వానుభూతి కావలయును. ఇచట నది లేదు. పూర్వానుభూతి లేని స్మరణ ఇది అలౌకికము. అందుచేతనే 'న లౌకిక తుల్యా' అని చెప్పబడినది.

ఈ స్థితియందు సామాజికులను నిలిపి కవికుల గురువు పంచమాంకమునంతయు నడిపినాడు ఇందు కనియే కవికులగురువు. 'నానృషిః కురుతే కావ్యమ్' అన్నమాట ఇట్టి రచనను గురించి పుట్టినది. గణ యతిప్రాసలు, ఏదోయొక గుణాధానము చేసి పద్య రచన చేసెడు ప్రతివానిని గూర్చి చెప్పినదిగాదు. 'ఋషిర్ద్రష్టా' ద్రష్ట యనగా, ధర్మము, బ్రహ్మపదార్థము, చైతన్యము, మోక్షము మొదలైన మహా విషయములలోని యొకానొకరహస్యమును దర్శించినవాడు. దానిని దర్శించి జగత్తునందలి మందబుద్ధుల కుపదేశించినవాడు. దీనికి, సజ్జనులు దానిని గ్రహించి తదనుకూలముగా ప్రవర్తించుట ప్రయోజనము. లేడి యడవిలో సెలయేట నీరు త్రావుచుండును. ఒకచెవి రిక్కించి యడవిలోని సవ్వడి వినుచుండును. ఈ సంగతి వేటకాండ్రు గుర్తింతురు. దీనిని తక్కినవారెరుగరు. ఇది చెప్పిన వేటకాడు ద్రష్ట కాడు. మానవ ప్రకృతిలో, ప్రవర్తనలో, చాల రహస్యములుండును. వానిని మహాకవులు చెప్పుదురు. వారు ద్రష్టలుకారు. మొదటి దశకవి. రెండవది సుకవి. మూడవది మహాకవి. నాల్గవది ఋషి. ఈ నాల్గు లక్షణములు సంపూర్ణముగా కలవాడు కాళిదాసు.

ఈ పునాదిమీద పంచమాంకమునందలి శకుంతలా ప్రత్యాఖ్యానము పరామర్శింపబడవలయును.

## పి. శ్రీదేవి | వాళ్లుపాడిన భూపాలరాగం

రామారావు అడుగులు జాగ్రత్తగావేస్తూ నడుస్తున్నాడు. సిమెంటురోడ్డుమీద నడవడం అతనికి కొత్త. అప్పుడే వర్షాలు పడుతున్నాయి. అయినా ఎండలు తీవ్రంగానే ఉన్నాయి. అంతవరకూ వర్షం పడి వెలిసింది. ఎండ తీవ్రంగా వచ్చేసింది. సాయంత్రమైనా కాదు. మిట్టమధ్యాహ్నం. సిమెంటురోడ్డు మీద తడి యింకా ఆరలేదు. రామారావుకి జారి పడతానేమో అని భయం. అందుకే అతడు అడుగులు జాగ్రత్తగా వేస్తున్నాడు. ముక్కుకు సూటిగానే నడుస్తున్నా పక్కనించి దూసుకుపోతూన్న సిటీబస్సులు, కార్లు, అంబులెన్సులు- అన్నిటినీ తప్పుకుంటూ రోడ్డుకు ఎడంపక్కనే నడుస్తున్నాడు రామారావు. నడుస్తున్నకొద్దీ కొండెక్కినట్టు రోడ్డు ఎక్కడికో ఎక్కిపోతూంది. యువకుడు అనికూడా యింకా అనడానికి వీల్లేని అర్భకుడు రామారావు. అతనికి ఆయాసం వస్తూంది. నెత్తి మాడిపోతూంది. పరీక్షాఅయినా చేయించుకుందామా అనుకున్నాడొకసారి. హాస్పిటల్ గేటు కనిపిస్తూనే ఉంది. అది దాటితే మరొక ఫర్లాంగుకంటె ఎక్కువుండదుట కలెక్టరాఫీసు. ఎలాగో నడిచేస్తే...... "ఒరేయ్ రామం! రామం......" పరిచితమైన కంఠమేదో తనని వెంట తరుముతూంది. రామారావు వెనక్కి తిరిగిచూశాడు. సైకిలూ, దానికొక క్యారియరూ. దాని నానుకునే శ్రీనివాసులూ- అవతల పేవుమెంట్ మీద నిల్చుని పెడబొబ్బలు పెడుతున్నాడు. అతనక్కడే నిల్చుని చెయ్యూపేడు. రామారావే రోడ్డుదాటి అవతల పేవ్ మెంటు చేరుకున్నాడు.

"ఏంరోయ్! ఎప్పుడువచ్చావూ ఎక్కడ దిగావు? ఏమిటి విశేషం? అన్నట్లు పరీక్ష పాసయావా?"

రామారావు శ్రీనివాసులు నెరుగకపోడు. కాని యింత వ్యవధిలేకుండా ప్రశ్నలు- రోడ్డుమీద ఆ కేకలూ- రామారావుకి చిరాకు వేసింది. అయినా ఏం చెయ్యగలడు? శ్రీనివాసులు తనకంటె పది, పన్నెండేళ్లయినా పెద్ద. రామారావు అన్నిటికీ సమాధానం చెప్పక తప్పలేదు.

"పొద్దుటే వచ్చాను బావా! సూర్యంబాబాయి గారింట్లో దిగాను. పరీక్ష పాసయానులే. అందుకే ఈ తిప్పటంతా" అన్నాడు.

"అంటే?"

"మరేముంది? ఉద్యోగ ప్రయత్నం" అన్నాడు రామారావు.

"ఓరి భడవా! నిండా పదహారేళ్ళున్నాయో లేదో నీకెవడిస్తాడురా ఉద్యోగం! స్కూలుఫైనలు పాసయానంటున్నావు కాని శుద్ధ తెలివితక్కువ వాడిలా ఉన్నావే. మీనాన్నే పంపించాడా నిన్ను? ఇంట్లోంచి పారిపోయొచ్చావా?" శ్రీనివాసులు ఆగకుండా యింకా ఏదో అనేయబోతున్నాడు. అసలతని ధోరణే అది. అవతలవాళ్ళు చెప్పబోయేది కూడా తానే ఊహించేసుకుని ఆపైన తన వ్యాఖ్యానాన్నికూడా వినిపించేస్తాడు. కాని రామారావు మధ్యలోనే మరోలా సమాధానం చెప్పాడు: "అదేమిటి బావా! అలాగంటావూ! నాన్నే నన్నిక్కడికి పంపించారు. ఆమధ్య ఆయనా వచ్చారిక్కడకి. చాలా అప్లికేషన్లు పెట్టించారు. ఏవో చిన్నచిన్న ఉద్యోగాలేలే. వాటి విషయం తేల్చుకుందుకే నన్ను పంపించారు" అని ఆగబోయి మళ్లీ శ్రీనివాసులు ఏం మొదలు పెడతాడోనని" అవును కాని నువ్వెక్కడికి? ఆఫీసుకా?" అన్నాడు.

శ్రీనివాసులు ఫకాలునవ్వి "ఇప్పుడాఫీసేమిట్రా నీతలకాయగానీ! అయినా క్యారియరూ అన్నమూ పట్టుకుని ఆఫీసుకెవడైనా వెళతాడా! నాజన్మలో నేను ఉద్యోగం చెయ్యలేదు. ఇంక చెయ్యను. ఆ వెధవలు మహాయిస్తే అరవై యిచ్చేరు, తొంభై యిచ్చేరు. దానితో సంసారం గడిచిపోతుందంటావా?" అన్నాడు. రామారావుకి నిజంగా అతవనేది బోధపడలేదు. బోధపరుచుకునే లోపునే "మనం యిలా మాటాడుతూ కూచుంటే ఆసుపత్రివాడు టైమయిందని గెంటేస్తాడు. పదపద. మా ఆవిడ ఆవురావురంటూంటుంది ఆకలితో!" అంటూ రామం చెయ్యిపట్టుకుని హాస్పిటల్ వైపు లాక్కెళ్లాడు.

శ్రీనివాసులు చెప్పాడు. వాళ్ళావిడ ప్రసవించి పదిరోజులయిందట. రేపు డిశ్చార్జి చేస్తారట. ఆవిడకి అన్నం పట్టుకొచ్చేడట. గేటుదాకా వెళ్ళాక "ఇక్కడే ఉండు. నిన్నిప్పుడు లోపలికి రానీయరు. నేను లోపలికివెళ్ళి క్యారియర్ యిచ్చేసి నిముషంలో వచ్చేస్తాను." అంటూ రామారావుని నిలవేశాడు. "కాదు, నాకు పనుంది. వెళ్ళాలి." అనలేక పోయాడు రామారావు.

క్యారియరిచ్చేసివచ్చి శ్రీనివాసులు రామారావుని తనతో యింటికి బలవంతంగా తీసుకుపోయాడు. పట్నం వచ్చేటప్పుడు నాన్న చెప్పిన మాటలన్నీ బాగా జ్ఞాపకం ఉన్నాయి. "ఒరేయ్! నువ్విక్కడా అక్కడా దిగి అవస్థపడకు. తిన్నగా మనవాళ్ళ వీధికెళ్ళు. ఆ వీధిలో మనవాళ్ళెవరింట్లో దిగినా నీకు బాగానే జరిగిపోతుంది. సూర్యం బాబాయి ఉన్నాడు. లేదా ఆవీధి చివర డాబా యింట్లో ముందువాటాలోనే సుబ్బారావూ సీతా కాపురం. వాళ్ళదింకా కొత్త కాపురంలే. అయినా వాడికి మనవాళ్ళంటే ప్రాణం అనుకో. ఆవీధి మలుపు తిరగగానే కుళాయీ బాదంచెట్టు ఉన్న యిల్లే వెంకటేశ్వర్లు అద్దెకుంటున్నది. నీయిష్టం ఎక్కడ దిగినా అంతా కావలసినవాళ్ళే. అసలందరి యిళ్ళల్లోనూ ఒక్క పూటైనా భోజనం చెయ్యనిదే వదలరులేవాళ్లు. కాని ఒక్క విషయం జాగ్రత్త. ఆ ప్రక్క వీధిలోనే ఉంటున్నాడట మీ అత్త కొడుకు శ్రీనివాసులు. వాడు మనిషి మంచి వాడే. దాన్నెవత్తెనో తెచ్చి కాపురం పెట్టకపోతే నేనిలా అనేవాడినికాను. లోకులు కాకులన్నారు. అటువైపుపోక నీ పనులేవో నువ్వు చూసుకో..." తాను పట్నం వస్తాననగా నాన్న యింకా ఎన్నెన్నో చెప్పాడు. ఒకటికి రెండురోజులైనా ఉండమన్నాడు. తానిచ్చిన అడ్రసులవాళ్ళ నందరినీ కలవమన్నాడు; వినయంగా విధేయంగా వాళ్ళను మెప్పించేలా మెలగమన్నాడు. కొందరిని తాను రికమెండేషన్ కోసం కలవాలి. మరికొందరిని ఉద్యోగ మిప్పించమని ప్రాధేయపడటానికి కలవాలి.

నాన్న యిన్ని విధాల యిన్ని చెప్పినా తనకు శ్రీనివాసులుతో వాళ్ళింటికి వెళ్ళక తప్పలేదు. శ్రీనివాసులుది చిన్న యిల్లు. రెండు గదులూ, ముందర వరండా, పెరట్లో వంటకి స్నానానికీ రెండు కొట్లు. అయినా వాటాలు, మరొకరితో సంపర్కం లేకుండా హాయిగా ఉంది. వీధి వరండాలో బల్ల మంచంమీద చతికిలబడ్డాడు రామారావు. శ్రీనివాసులు సైకిలు ఆ పక్కనేపెట్టి "ఉండు; కాసిని మంచినీళ్ళు తెస్తాను. మరీ ఎండ పడిపోయావు" అంటూ లోపలికి వెళ్లాడు. అతను మరి రెండు నిముషాలకే మంచినీళ్ళతోనేకాక మరొక స్త్రీమూర్తితోసహా బయటికివచ్చి "ఇదిగో వీడు మా రామం. అంటే మా రామచంద్రం మామయ్య కొడుకు. వేలెడంత ఉన్నాడు. స్కూలు ఫైనలు పాసయిపోయి ఉద్యోగంకోసం ఈఊరొచ్చాడు." అంటూ రామాన్ని చూసి చిరునవ్వుతో "ఈవిడ మీ యింకో అక్కయ్యరామం! ఈవిడ పేరు వరలక్ష్మి." అన్నాడు. రామాన్ని ద్వైధీభావంతోకూడిన ఎన్నో ఆలోచనలు ఊపిరాడనియ్యకుండా చేసినా అతనిలో ఏమూలో ఉన్న సంస్కారం అతనిచేత "నమస్కారం" అనిపింపచేసింది. ఆవిడ మల్లెపూవులా విడిన ముఖంతో

"భోజనమైందా తమ్ముడూ?" అన్నది. రామం ఆ పలకరింపునకు నిర్ఘాంతపోతూనే "అయిందండీ! పదిగంటలకే బాబాయిగారింట్లో చేసేశాను." అన్నాడు. "లోపలిగదిలో కూర్చోబెట్టండి- అర గంటలో టిఫిను కాఫీ తయారయిపోతుంది." అంటూ అదే ప్రసన్నవదనంతో ఆమె ఇంట్లోకి వెళ్ళిపోయింది.

"రా రామం! లోపల కాస్త చల్లగానైనా ఉంటుంది. వెధవ వర్షంపడి మరింత ఉడకబెడుతూంది" అంటూ శ్రీనివాసులు లోపలికి దారి తీశాడు. ఇంటి నాల్గు మూలలూ పరిశీలిస్తూ రామం అతనికూడానే వెళ్ళాడు.

* * * *

మూడు నాలుగేళ్ళక్రితం రామంవాళ్ళ ఊరికి ఏవో భూముల తగాయిదాల్లో తరుచూ వెళ్ళేవాడు శ్రీనివాసులు. అసలు ఆవీధిలో ఈనాడు స్థిరపడిన ఈ శ్రీనివాసులు, సూర్యం, సుబ్బారావు, వెంకటేశ్వర్లు— వీరందరూ రెండు తరాలకు పూర్వం సమిష్టి కుటుంబంగా బ్రతికే ఒక కుటుంబపు సంతానమే.

ఫలానా ఊరు కిష్టయ్యగారు అంటే బోలెడు ఆస్తి, గంపెడు సంసారము. ఆ కిష్టయ్యగారి ఆడపిల్లలకు పిల్లలు, మొగపిల్లలకు మనుమలు పుట్టగా, తలొక తోవ పట్టగా, కొందరుమాత్రం పట్నం చేరుకున్నారు. కొత్తగా పట్నం చేరినవాడికి ఇదివరకు పట్నంచేరినవాడు ఇంటివాటా చూసిపెట్టడం, అవసరాలకి ఆదుకోవడం జరుగుతూండేది. ఈ విధంగా ఆ అయిదారు కుటుంబాలు ఆవీధిలోనే స్థిరపడ్డారు.

మూడు నాలుగేళ్ళ కిందటిదాకా శ్రీనివాసులు సూర్యంబాబాయితోనే ఉండేవాడు. సూర్యం మొదటి కళత్రం ఒక్క-ఆడపిల్లని కని చనిపోయింది. ఆపిల్లే శ్రీనివాసులు భార్య సుశీల. ఆమే యిప్పుడాస్పత్రిలో ఆరో శిశువును ప్రసవించి రేపింటికి రాబోతూంది. సూర్యం మొదటి భార్య పోయాక మళ్ళీ పెళ్లిచేసుకొన్నాడు. శ్రీనివాసులికి పదహారవ యేట పెళ్లయింది. అతని తండ్రి అంతకు ముందే చనిపోయాడు. తరువాత ఏడాదిలోపునే తల్లి పోయింది. అప్పటినుంచీ మామగారి యిల్లే అతనికి శరణ్యం. శ్రీనివాసులుది కాస్తాకూస్తా ఆస్తికాదు. పథ్థైయకరాల మాగాణి. మామగారి రెండోభార్యకు ఏటేటా సంతానం, అతని భార్యకు రెండేళ్ల కొక శిశువు తప్పనిసరి. పుట్టిన ప్రతి పిల్లకీ బాలసారెలు, పండుగలూ పబ్బాలూ. పట్నంవచ్చిన వాళ్లందరికీ ఆ యిల్లొక ధర్మసత్రం. ఆ ఉమ్మడి సంసారం ఖర్చులన్ని పాపం శ్రీనివాసులు పొలమే భరించింది. పొలం మీద డబ్బుతినేవాడే కాని దాని బాగోగులు చూచుకొనే నాథుడు లేక, రాబడికి మించిన ఖర్చుచేత కొంత హరించుకు పోయింది. మరికొంత కొత్త చట్టాల ధర్మమా అని రైతుల హస్తగతమయింది. ఇంత జరిగేక అందులోంచి మరి దమ్మిడీ పుట్టదని స్పష్టమయేక మామగారు అల్లుడితో రభసకు దిగేరు. అందులోంచి బయట పడ్డాకనే శ్రీనివాసులు వేరింట కాపురం పెట్టడం, కొత్త హంగులు కూర్చుకోవడం అన్నీ జరిగాయి. ఇప్పుడు అల్లుడికీ మామకీ మాటలు లేవు.

రామారావుకి ఈ జరిగిన సంగతులన్నీ చూచాయగా తెలుసును. మామతో వేరుపడినప్పుడే శ్రీనివాసులు వాళ్ల ఊరువచ్చి ఉన్న భూమిలో వీలైనంత అమ్మేసి ఆడబ్బు పట్టుకుని వేరింట కాపురం పెట్టాడు. అయితే రామానికి బోధపడనిదల్లా ఒక్కటే. అసలే ఇంత బెడదగా ఉంటే ఆ ఎవర్తెనో ఎందుకుతెచ్చుకున్నాడు? అనవసరంగా ఎందుకు చెడిపోయాడా అని.

* * *

మధ్యాహ్నం పన్నెండుగంటలకి తారసపడిన శ్రీనివాసులు సాయంత్రం ఆరైనదాకా రామాన్ని విడిచిపెట్టలేదు. ఎలాగో ఆరు గంటలకి అతి ప్రయత్నంమీద బయటపడ్డాడు రామం. అతనికి మనస్సు కలగాపులగంగా వుంది. ఇప్పుడింక చేయ

వలసినదేమిటి? సూర్యం బాబాయి యింటికి వెళ్లాలా? ఇప్పటినుండీ ఎందుకు- భోజనం వేళకు వెళితే సరిపోతుంది. అయినా ఆ యింట్లో మహా చీదర. వాళ్ల పిల్లలు - బాబోయ్ యమకింకరుల్లాంటివాళ్లు. ఇంటికెవడో కొత్తవాడు వచ్చేడనే గౌరవం లేదుకదా నెత్తెక్కి పిండి కొడతారు. జేబులు తడిమేవాడొకడు. భుజమెక్కే దొకతే. పొద్దుట రెండుగంటల అనుభవంతోటి తలవాచి పోయింది రామానికి. దానికితోడు సూర్యం బాబాయి భార్య దాసీదానితో పోట్లాట ఒకటి. ఆసీను సినిమా తియ్యాలిసిందే. ఆ కోపంలో తనకి కాఫీ తెచ్చియ్యబోయి భడాలున గ్లాసు కింద పడేసింది. మళ్ళీ కాఫీ తయారయేసరికి ఒకగంట పట్టింది కాని మళ్ళీవచ్చిన కాఫీ అది కాఫీకాదు. రంగూ రుచీ వాసనాలేని ఏవో కషాయం నీళ్ళు.

వచ్చినతోవనే రోడ్డెక్కి బీచివైపునడుస్తున్నాడు రామం. సూర్యంబాబాయి యింటికీ శ్రీనివాసులు యింటికీ ఎంతతేడా! ఇల్లు చిన్నదే కాని శుభ్రంగా ఉంది. లోపలిగదిలో కొద్దిగా ఫర్నిచరూ చిన్న రేడియోకూడా ఉన్నాయి. వాళ్ళకి అయిదుగురు పిల్లలున్నారు. అంతమంది పిల్లలున్న సంసారంలానే లేదు. పెద్దపిల్లలు బడికిపోయేరట. చిన్నవాళ్లు నిద్రపోతున్నారు. అందరిలో పెద్దదానికి పదకొండేళ్ళుట- అప్పుడే థర్డుఫారమ్ చదువుతూందట. "అది చాలా తెలివైనదిరా-దానిని ఎం బి. బి. యస్. చదివిస్తాను," అన్నాడు శ్రీనివాసులు. అదృష్టమంటే అలా ఉండాలి. తనూచదివేడు చాలా చురుకుగా, స్కూలుఫైనలులో వాళ్ళ స్కూలుకి తనదే ఫస్టుమార్కు. చిన్నప్పటినుండీ ప్రతి క్లాసులోనూ తనదే పైచెయ్యి. అయినా తనతండ్రి రామచంద్రయ్య ఒక్కనాడైనా "నిన్ను పై చదువులు చదివిస్తాను" అనలేదు. రామచంద్రయ్యకు సమస్యల నిట్టే పరిష్కారం చేసే తెలివితేటలున్నాయి. పెద్దకూతురు మీనాక్షికి పదహారోయేడు వచ్చిరాగానే సంబంధాలకోసం ఎక్కువ బాధపడకుండానే రెండో సంబంధం చేసి వదిలించుకున్నాడు. రెండోసంబంధ మైతేనేం వాళ్ళాస్తిపరులు - పిల్ల సుఖపడుతుంది అంటాడతను. ఇక కొడుకు రామారావు స్కూలుఫైనలు పరీక్ష వ్రాసి రాగానే రామచంద్రయ్య బయలుదేరి పట్నం వచ్చి ఏయే ఆఫీసుల్లో ఏయే ఖాళీలున్నాయో వాకబుచేసి నలభై రూపాయిల జీతం మొదలుకొని అరవైదాకా యిచ్చే అన్ని ఉద్యోగాలకీ అప్లికేషన్‌ఫారాలు తెచ్చి కొడుకుచేత సంతకాలు పెట్టించాడు. రామం చేతిలో ఇరవై రూపాయిలుపెట్టి పట్నం పంపించినది ఆ ఫలితం తేల్చుకుందుక.—ఒకవేళ ఏ ఉద్యోగమైనా దొరికి వెంటనే చేరిపొమ్మంటే సందేహించక అలాగే చేయమన్నాడు. నిజానికి శ్రీనివాసులు కున్న స్తోమతఏమిటి? ఆ మాత్రం రామచంద్రయ్యకూ ఉంది. ఒక్కగానొక్క కొడుకు చదువును స్కూలు ఫైనలుతో ఆపేయవలసిన అవసరంలేదు. అయినా రామచంద్రయ్యకి కొడుకు పెద్దచదువులు చదవాలనే దురాశలేదు. ఎలాగో అందరూ బతికుంటే చాలు - అంతే.

బీచిలో కూర్చుని ఇసుకతవ్వుతూ బాగా చీకటి పడేదాకా రామం ఒకటే ఆలోచిస్తున్నాడు. వీళ్ళందరూ ఎందుకు బతికున్నట్లు? తనుమాత్రం చేయబోయేదేమిటి? ఇలాంటి బరువైన ఆలోచన అతని కాయా పండూ కాని మెదడులో ప్రవేశించినపుడు రామాని కనిపించింది. "నేనప్పుడే అంత పెద్దవాడినయిపోయానా - నాయీడువాళ్ళు ఆ వెంకటస్వామి చిన్నకొడుకు, మిల్లు మేనేజరుగారి పెద్దకొడుకు వీధుల్లో గోళీలాడుకుంటూ హాయిగా గడపడంలేదా!".... రామం వయస్సుకంటె అతని మెదడు ముందుకు పోతూంది. అందుకే రామానికి భయంగా ఉంది.

మళ్ళీ వరలక్ష్మి గురించిన ఆలోచన. అసలెవరావిడ? ఎవరైతేనేం? మనిషి మంచిది. ఎంత ఆప్యాయంగా ఉంటుంది! మనిషిలో ఎక్కడా

అల్పత్వం కనబడదు. అలా అనుకునేసరికి మళ్ళీ రామానికి భయం వేసింది. సూర్యం బాబాయి ప్రొద్దుటే అన్నాడు—"ఒరే మీ సుశీలక్క మొగుడు శ్రీనివాసులు లేడూ వాడీ ప్రక్కవీధిలోనే ఉన్నాడు. బాగా చెడిపోయాడు. వినే ఉంటావు. వాడి గుమ్మంమాత్రం తొక్కకు. నీకసలే అశుభమూ శుభమూ తెలియదు. నిన్నుకూడా చెడిపేయగలడు." అంటూ-క్లాసులో ఫస్టుమార్కులు తెచ్చుకోవడం తప్ప మరొక పరిజ్ఞానంలేని రామానికిదంతా ఏం బోధపడుతుంది? ఏది చెడిపోవడమో ఏది కాదో కూడా అతనికి బోధపడటం లేదు. మధ్యాహ్నంనుండి సాయంత్రందాకా అక్కడుంటే అది చెడిపోవడమేనా అని అతని మనస్సు పదేపదే ప్రశ్నిస్తూంది. అయినా వరలక్ష్మిపట్ల అతనికి గౌరవమే కలిగింది. అందువల్ల శ్రీనివాసులంటే మరింత అభిమానం వచ్చింది. ఆ సంగతి ఎవరికి తెలిసినా ప్రమాదం. అందుకని ఆలోచనల నన్నిటిని గుప్తంగా దాచుకుని యమలోకంలాంటి తన బస చేరుకున్నాడు రామం.

మర్నాడంతా రామం తన పనిమీద ఎక్కడెక్కడో తిరిగాడు. ఒక్కచోటకూడా ఉద్యోగం వచ్చే ఆశ కనబడలేదు. రాత్రి యింటికి చేరుకునేసరికి పొద్దుపోయింది. గుమ్మంలో అడుగుపెడుతూ యింట్లో మనుష్యులు లేరేమో అనుకున్నాడు. ఇల్లంతా చీకటి గుయ్యారంలా ఉంది. ఇంతలో ఉన్నామండో.య అని చెప్పడానికే అన్నట్లు చంటివాడు కాకిగోల మొదలుపెట్టాడు. ఇంటావిడ ఆ చీకట్లో ఏ మూలో ఓగోరంత ఆముదం దీపం వెలిగించి "పడవుకురా బాబూ! యిదిగో దీపం వెలిగించాను" అంటూంది ఆ ఆరునెలల పసివాడితో. అంత చీకటిలో ఒక్కడుగు ముందుకు వెయ్యటానికికూడా భయంవేసింది రామానికి. ఏపోకిరీ పిల్లో కాళ్ళకింద కసుక్కుమంటుందేమో అనిపించింది. "హరికేన్ లాంతరూ అగ్గిపెట్టె యిలా పడెయ్యండి పిన్నిగారూ! నేను వెలిగిస్తాను" అన్నాడు పీధరుగుమీదనుండే. వీధిలోనుంచే వస్తూ గడపలో కాలుపెట్టిన సూర్యం "వచ్చావా రామం! నీకోసమే ఎదురుచూస్తున్నా. చూడూ! కిరసనాయిలు అయిపోయింది. సమయానికి అగ్గిపెట్టికూడా అయిపోయిందిట. మీపిన్ని పట్టి అపసంతి మనిషనుకో - వెలుగుండగానే ఇలాంటివన్నీ చూసుకోవద్దూ. ఆ వెంకటేశంగాడింటికి వెళ్ళాను. ఇంత కిరసనాయిలు పోసి ముట్టిస్తాడేమోనని. వాళ్ళంతా సినిమా కెళ్లిపోయారుట. ఒక్క అర్ధరూపాయుంటే యిలా పడెయ్యి. యిప్పుడే ఒక్క అంగలో ఒకబుడ్డి కిరసనాయిలూ ఒకఅగ్గిపెట్టి తెచ్చుకొస్తాను" అంటూ చెయ్యిచాచాడు. రామానికివ్వక తప్పలేదు. అర్ధరూపాయ తీసికుంటూనే "మరోలా అనుకోకు నాయనా! సమయానికి ఆపర్సు ఎక్కడ పెట్టేశానో గుర్తులేదు. ఈచీకటిలో ఎలా వెతకను చెప్పు. రేపిచ్చేస్తానులే!" అంటూ వీధిలోకి వెళ్ళిపోయాడు.

తరువాత మూడురోజులలో రామానికి మరికొన్ని చిత్రమైన అనుభవాలు కలిగాయి. ఒకరోజు మధ్యాహ్నం . పప్పన్నంపెట్టి పిన్నిగారు "ఈ పట్నంలో కూరగాయలు సరిగాదొరకవు నాయనా! బోలెడు డబ్బుపోసినా కూరన్నదే కంటికి కనబడదు" అంటూ మజ్జిగ వడ్డించేసింది. అది ఆ ఒక్కపూట సంగతి కాదు. రాత్రి కందిపచ్చడి పగలు నీళ్ల చారు- ఎప్పటికప్పుడే పట్నాన్ని తిట్టిపొయ్యటం. ఆయింట్లో ఏదీ ఏప్పుడూ ఉండదు. ఉన్నదల్లా ఒక్కటే-లేమి. అయినా అందరూ బతికేస్తున్నారు. బతకడంలోనూ అతి నిబ్బరంగాను ఒక్కరూ దానిని లేమి అనరు. భార్య అపసంతితనం అంటాడాయన. భర్త మతిమరుపు అంటుందావిడ. ఒకనాడు— "బియ్యం నిండుకున్నాయి. ఒకబస్తా పంపించమని ఆకొట్టువాడితో నిన్ననగా చెప్పాను. వాడొక మతిమరుపు ముండాకొడుకు. ఒకరూపాయి యిలా యియ్యి నాయనా! పక్క కొట్లో తెస్తాను" అన్నాడు సూర్యం. రామం యివ్వకుండా ఉండ

లేక పోయాడు. నాన్న యిచ్చిన ఇరవైరూపాయిలలో ఆరురూపాయలు సూర్యంబాబాయే కాజేశాడు. తిరిగి యిస్తాడన్న ఆశ తనకు లేదు. అతనికి అంతుచిక్కని విషయమల్లా ఒక్కటే. ఈ యింట్లో ఇద్దరు పెద్దవాళ్ళు ఏడుగురు పిల్లలూ కానీ సంపాదన లేకుండా ఎలాగ బతుకుతున్నారా అని. లేని డబ్బు ఎలాగా లేదు. శుచీశుభ్రమూ అయినా లేదు. వాళ్ళభాష, వాళ్ళప్రవర్తన, వాళ్ళఅలవాట్లు అన్నీ రామానికి అసహ్యామే కలిగించాయి.

ఆమూడురోజుల్లో అతనికి మళ్ళీ శ్రీనివాసులుని కలవటం పడలేదు కాని తక్కిన బంధువులను సందర్శించక తప్పలేదు. ఒక్కొక్క కుటుంబం ఒకవిచిత్రమైన సంస్కారంతో బతుకుతూంది. తన తండ్రి రామచంద్రయ్య ఈవంశవృక్షంలోవాడే అయినా అతని తరహావేరు. అతడు చేసేది శుద్ధమేష్టరీ ఉద్యోగమేఅయినా అతడు లేమితో బాధపడడు. అశుచితో బాధపడడు. అనారోగ్యం వాళ్ళింట్లో ఎరుగరు. వాళ్లది ఒక కుదురైన చిన్న సంసారం. జీవితావసరాలైన తిండి బట్ట సమపాళ్ళలో ఉంటాయి. అంతకుమించి మరేమీ అక్కరలేదుకూడా. రేడియోలు, గ్రామఫోనులు, సినిమాలు వీటిలో బొత్తిగా నమ్మకంలేదు రామచంద్రయ్యకు. ఏదైనా కథ, కార్యమూ జరిగినా, పొదుపుగా, మళ్ళీ శాస్త్రోక్తంగా జరిపిస్తాడు. శాస్త్రం ముఖ్యం కాని ఆడంబరాలెందుకురా అంటాడతను. బతికున్న ప్రతివాడికీ తిండి బట్ట; తినడానికీ కట్టుకుందుకూ బతికుండడం. ఇదే జీవిత పరమావధి అని రామచంద్రయ్య అనుభవం. ఆసంస్కారంలోనే పెరిగి, ఆ తిండిబట్ట సమకూర్చుకునే జీవనోపాధికోసం వచ్చిన రామానికి, జీవితం పొదుపును చాలా తక్కువచూసిన రామానికి; ఇటు సూర్యం అటు వెంకటేశ్వర్లు, మరొక భ్రాతృసమానుడు సుబ్బారావూ- అందరూ వింతగా కన్పించారు.

వెంకటేశ్వర్లు వారానికి మూడుసినిమాలయినా చూస్తాడు. వచ్చిన సినిమానల్లా కనీసం రెండుమార్లయినా చూస్తాడు. భార్యతోసహా వెళతాడు. అతనికి డెబ్బయిరూపాయల ఉద్యోగంట. ఇద్దరు పిల్లలున్నారు. పిల్లల్ని పక్కవాటా వాళ్ళింట్లో వదిలేసి భార్యాభర్తలు సినిమాలు చూస్తారట. అతనిదగ్గర విశేషమేమిటంటే డబ్బులేదని భోజనం మానేయగలడు. ఆవిడా అంతే. పిల్లలికి ఆపూటకి ఒక పకోడీలపొట్లం కొనిచ్చి యిన్ని మంచినీళ్లు తాగిస్తారు. సినిమామాత్రం విధిగా చూడాలిసిందే. అయితేమాత్రం ఇరవై రూపాయిలు ఇంటద్దెకే అవుతుందిట. డబ్బుకట్టలేదని వాళ్ళవాటాకి ఎలక్ట్రిసిటీ కనెక్షన్ పీకేశారుట. ఆపకోడీలకయినా ఆసినిమాలకైనా అతనికొచ్చే డెబ్బయి రూపాయలు ఎలా చాలుతాయన్నది రామం స్కూలుఫైనలు మెదడు లెక్క కట్టలేకపోయింది.

సుబ్బారావు తండ్రి వ్యాపారంలో లక్షలు గడించేడంటారు. కాని ప్రస్తుతం ఆస్తి ఎంతో అప్పు అంతా ఉందని అనుకుంటారు. ఏదయినా లక్షాధికారి కొడుకు గనుక సుబ్బారావు ఫోర్తు ఫారమ్ దాటి ఇంటర్మీడియట్ ఫెయిలవడానికి పన్నెండేళ్లు తీసుకున్నాడు. అంటే అతనికి దగ్గరగా ముప్పయియేళ్ళున్నాయి. వాళ్లహోదాకు తగిన సంబంధం దొరకక పెళ్లిచాలా కాలంగా వాయిదాపడి ఈ మధ్యనే జరిగింది, దానితో చదువు పూర్తిగా సున్న చుట్టేసింది. చిన్న ఉద్యోగాలు చెయ్యడం వాళ్లకు పరువునష్టం. పెద్ద ఉద్యోగానికి ఆర్డరు అతనికింతవరకూ రాలేదు. అందుచేత నాన్న యింటినుండి లెక్కపెట్టి డబ్బు పంపిస్తాడు. అది వాళ్ళ కొత్త కాపురానికి వారం రోజులకే చాలదు. సినిమాలు, బోటుషికార్లు, హోటళ్లు, ఐస్క్రీములు. వీటికే ఎక్కడలేని డబ్బు చాలదు. ఆ తరువాత ఎలా గడుస్తూంది వీళ్ళకి - రామానికదీ ప్రశ్నే.

* * *

రామారావు తాను వచ్చిన ఐదో రోజున కాబోలు మళ్ళీ శ్రీనివాసులు యింటికి వెళ్ళాడు. అప్పటికి సుశీల హాస్పిటల్ నుండి యింటికి వచ్చే

సింది. సుశీలక్కయ్యని తను బాగా చిన్నప్పుడు చూచాడు. అయినా ఆవిడ వెంటనే పోల్చి పలకరించింది. శ్రీనివాసులు యింట్లోలేడు. "మళ్ళీవస్తా" అని తిరిగి వెళ్ళ బోతూంటే సుశీల "అదేమిటి రామం! మీ బావ పావు గంటలో రానే వస్తారు. మేమేం కొత్తవాళ్ళం కనుకనా! ఇలా కూర్చో. నే నాసుపత్రిలో ఉండగా వచ్చేవుట కదూ!" అంటూ మాటల్లో దింపింది. వరలక్ష్మి తనరాక నెప్పుడు గమనించిందో కాఫీ తెచ్చిఇచ్చింది. కాఫీ పుచ్చుకుంటూనే రామంవాళ్ళిద్దరి వంకా తీక్షణంగా చూచాడు. అతని మనస్సులో కొన్ని పరిచితమైన అభిప్రాయాలేవో ముందు మెరిశాయి. "వీళ్ళిద్దరూ ఒక్క యింట్లో! ఎంత అన్యాయం! వెంకటేశ్వర్లు మొన్న అన్నట్లు సుశీల అక్కయ్య ఎంత కుమిలిపోతుందో!" ఒక క్షణమాత్రం అతని సానుభూతి అంతా సుశీలవైపు ఒరిగింది.

"అయ్యయ్యో! అదేమిటమ్మా పచ్చిబాలింతవు నన్నడిగితే నేనివ్వనూ!" పిల్లబట్టలకోసం మంచం దిగి వెళుతూన్న సుశీలను వారిస్తూ అంది వరలక్ష్మి.

"బాగుంది తొలికాన్పునాడే లేని సుకుమారం మీవాళ దేనికి లక్ష్మీ" సుశీలకంఠంలో ఎత్తిపొడుపు లేదు. ఆదరం ధ్వనిస్తూంది.

ఏమిటి వీళ్ళిద్దరూ! నటనా! అని విస్తుపోయాడు రామం.

ఆ విస్మయం అట్టేసేపులేదు రామానికి. పావు గంటలో వస్తాడన్న శ్రీనివాసులు అరగంట దాటాక గాని రాలేదు. ఈ మధ్యలో సవతు లనిపించుకునే ఆ యిద్దరు స్త్రీలు రామారావు అభిప్రాయాలెన్నో మార్చేశారు. వట్టిది. సుశీల ఏమీ కుమిలిపోడం లేదు. కుమిలిపోయే మనిషిలో ఈ ఆర్ద్రిత ప్రశాంతత ఎలా ఉంటుంది? వరలక్ష్మికీ ఆమెకీ మధ్య పొరపొచ్చా లున్నాయనడం శుద్ధ పొరపాటు. వాళ్ళమట్టుకి వాళ్ళు హాయిగా ఉన్నారు. లోకం ఎందుకింత అడిపోసుకుంటూందో!

శ్రీనివాసులు వచ్చాడు. రామారావు అంత వరకూ ఎవరెవరిని కలుసుకున్నాడో ఫలితాలెలా ఉన్నాయో అన్నీ చెప్పాడు. శ్రీనివాసులుతో రామం మాట్లాడుతుండగానే వెంకటేశ్వర్లు వచ్చాడు. రామాన్ని చూసి గతుక్కుమని "ఇదేమిటి మకాం మార్చేశావూ!" అన్నాడు. "అట్టే లేదు. ఊరికనే వచ్చాను" అన్నాడు రామం. వెంకటేశ్వర్లు శ్రీనివాసులుని పక్కకి పిలిచి ఏదో అన్నాడు. శ్రీనివాసులు లోపలికివెళ్ళి ఏదో అన్నాడు. మరో రెండు నిముషాల్లో వరలక్ష్మి వాకిట్లోకి వచ్చి శ్రీనివాసులు చేతిలో అయిదు రూపాయిలు కాబోలు పెట్టింది. అతని చేతిలోంచి ఆ నోటు వేంకటేశ్వర్లు జేబులోకి వెళ్ళడం అతను వెంటనే వీధిలోకి దాటెయ్యడం జరిగాయి.

మరొక పావుగంట గడిచాక సూర్యం పెద్ద కొడుకు సంచీ చేతపట్టుకుని వచ్చి "అక్కాయ్ ఒకశేరు బియ్యమియ్యమంది అమ్మ" అన్నాడు సుశీలతో. "వరలక్ష్మక్కయ్య నడుగు"అన్నదామె. ఆ అబ్బాయి లోపలికి వెళ్ళడం సంచి నింపుకుని బయటికి వెళ్ళడం గమనిస్తూనే ఉన్నాడు రామం.

రామానికి నిజంగా ఆశ్చర్యం వేసింది. ఏమిటి వీళ్ళంతా? వాళ్ళగడపలో కూర్చుని ఈ శ్రీనివాసులునే నానాతిట్లూ తిడతారు. అవసరాలన్నిటికీ ఇతనిగడప తొక్కటాని కెవరికీ సంశయంలేదు. వింతమనుష్యులు! అనుకున్నాడు.

ఉండబట్టలేక "ఏమిటి బావా! వీళ్లందరూ మీయింటికి వస్తారన్నమాట" అన్నాడు గొణుగుతున్నట్టుగా. శ్రీనివాసులు గట్టిగా సిగరెట్టు ఊది పారేసి—

"అదా! అదొక చిదంబర రహస్యంలే. వాళ్లంతా నన్ను వెలివేశారు. కాని డబ్బులికీ బియ్యానికీ వెలి లేదుగా" అని "ఆగొడవంతా దేనికిగాని రేపు నీప్రోగ్రాం ఏమిటి రామం? సినిమాకి వెళదాం రారాదూ?" అన్నాడు.

"ఏం సినిమాలో లేశావా! ముందు వచ్చినపని అయితేకదా! నాన్న చెప్పిన లిస్టంతా చాలవరకూ పూర్తయింది. ఒక్క పెద్దమనిషిమాత్రం కనపడ్డం లేదు. అతను రేపు ఊరునుండి వస్తాడట. అతన్ని కలుసుకుంటే ఏసంగతీ తేలిపోతుంది."

"ఎవరతను?"

"శేషగిరి అని కలెక్టరాఫీసులో ఉంటాడట..."

"అరి నీయిల్లు బంగారంగానూ! వాడా! చెప్పావ్ కాదూ- వాడిని నాకు బాగా తెలుసు. వాడి ద్వారా నీకేం కావాల్సినా చేయించేభారం నాది. అతనెవరో తెలుసా! వరలక్ష్మికి వరుసకి అన్నయ్యవుతాడు. నాకు క్లాసుమేటు కూడాను"-

ఆమాటన్నప్పుడు శ్రీనివాసులు రామంవైపు అదోలా చూశాడు. ఆ చూపులో రామానికి ఎన్నో అనిపించాయి. నీకు కావలసినది నేను చెయ్యగలను తెలుసా అన్నట్లు, చేస్తే నేనే ఎవరికైనా ఇలాంటి సహాయం చెయ్యాలి అన్నట్లు. ఏమని జవాబు చెప్పాలో తెలియని సందిగ్ధావస్థలో పడ్డాడు రామం. శ్రీనివాసులు అతని భుజంమీద చరిచి "ఏమిటలా బిత్తర పోతావు? నువ్వేదో అడగాలనుకుంటున్నావు. కాని భయపడుతున్నావు. నాకు తెలుసులే. నువ్వింకా పసివాడివి. తెలిసీ తెలియని జ్ఞానం. అయినా చూడూ నువ్వు తెలివైన వాడివి ప్రపంచపోకడలను కొంత చూస్తున్నావు. వాటిలోతేమిటో నీకు తెలియదు. ఈవయస్సులోనే ప్రపంచాన్ని కొంచెం అర్థంచేసికోవడం అవసరం. నాగురించి చాలా వినుంటావు. ఈ వరలక్ష్మి మాటెత్తినప్పుడల్లా ఎవరీమె? ఏమాకథ - అని నీ మనస్సులో కుతూహలపడతావు." అని నిజమే కదూ అన్నట్లు చూశాడు శ్రీనివాసులు రామం కళ్ళల్లోకి. రామానికి నిజంలాగా తోచింది. అబద్ధంలాగా తోచింది. తనకుతానై ఆ ప్రశ్నకు శ్రీనివాసుల్ని జవాబివ్వమనడు. కాని అతనే ఏదో ఉపోద్ఘాతం మొదలుపెట్టేసరికి ఆసక్తి పెరిగింది. "ఊ" అన్నాడు చివరికి.

"ఇక్కడ మనవాళ్ళందరూ నాగురించి చాలా చెప్పేరు నీకుకదూ! ఇక నాగురించి నేను చెప్పేది విను. నువ్వు నిజంగా చిన్నవాడివే. అయినా మీ నాన్న నిన్ను జీవితంలోకి నెట్టేస్తున్నాడు. అందుచేత పెద్దవాడిలా విను. వాళ్ళందరూ అన్నట్టు చిన్నవాడినిచేసి నిన్ను చెడుత్రోవ పట్టిస్తున్నానని భయపడకు. ఈ మహాప్రపంచంలో ఎవరిత్రోవ వాళ్ళది. ఒకళ్ళవల్ల మరొకరు చెడిపోవడ మనేది కేవలం పొరపాటు అభిప్రాయమనుకో. మానవుడు తెలివితక్కువవల్ల చెడిపోతాడు. లేదా చవటతనం వల్ల చెడిపోతాడు. బ్రతుకుతెరువు తెలిసినవాడెవ్వడూ చెడిపోడు." శ్రీనివాసులు మళ్ళీ రామాన్ని పరీక్షగా చూశాడు. తనుచెప్పేవి ఆసక్తిగానే వింటున్నాడు రామం.

శ్రీనివాసులు మళ్ళీ ప్రారంభించాడు. "నా సంగతి క్లుప్తంగా చెప్తానువిను. [illegible] ఈ మనుష్యుల మూలతత్వ మేమిటో, ఆతత్వాన్ని గుడ్డిగా అనుసరిస్తే మనకొరిగేదేమిటో అన్నది నీ తెలివితేటలనన్నీ కరగించి ఆలోచించు. మీ నాన్నా మా నాన్నాలాంటివాడే వరలక్ష్మి కొకనాన్న. ఒక్కతే కూతురు. కొడుకులు చాలామంది. మీ అక్కలందరికిలాగేనే ఆమెకి పదకొండో యేటో పన్నెండో యేటో పెళ్ళిచేశారు. డబ్బున్నసంబంధం. కాని ఏంలాభం ఏడాది తిరగకముందే ఆ మహానీయుడు చచ్చిపోయాడట. అప్పటికీమెకైతే డబ్బు విలువా తెలియదు. భర్తవిలువా తెలియదు.—

ఆమె నాన్నకి డబ్బు విలువ బాగా తెలుసు. వియ్యాలవారి ముక్కుపిండి పాతికవేల రూపాయిల ఆస్తి సంపాదించాడు. ఆమె బాల్యంనుండి యౌవనం దాక ఆ ఆస్తిని వడ్డీలకు వడ్డీలై పెరుగుతూ వచ్చింది. ఈ కాలపు మమష్యులు కొందరు మళ్ళీపెళ్ళి చెయ్యండి పాపం అన్నారుట. 'చస్తే అలా జరగదు' అనేశాడు చచ్చి స్వర్గాన ఉన్న తండ్రి. తెలివిగా చదువుకుంది. స్కూలుఫైనలు దాకా వచ్చేసరికి ఆపైన చదువుసాగనియ్యకుండా

చేశారు బతికున్న అన్నదమ్ములు. ఆమె గట్టిగా చదువుకుంటే ఎక్కడి కెగిరిపోతుందో - అప్పుడంత ఆస్తి వాళ్ళకి దూరమైపోతుందని వాళ్ళ బెంగ. కాని స్వేచ్ఛ, మెలకువ, ఆమె రక్తంలో నేఉన్నాయి. ఇరవై సంవత్సరాల వయస్సు వచ్చేసరికి ఆవిడకీ కోరికలు పెరిగాయి. ఆవిడ ఆస్తిమీద చూట్మూఉన్న మనుష్యులకూ మోజు పెరిగింది. ఆ సమయంలో ఈ శేషగిరి ద్వారానే నాకామె పరిచయం కలిగింది. కళ్లకేదో జబ్బుచేసి కె. జి. ఆసుపత్రిలో వైద్యానికి వచ్చింది— తననీ తన ఆస్తినీ జాగ్రత్తగా వాడుకో గలిగే మనిషి కావాలని అన్వేషించిందావిడ. వతి లాటరీయే అను రామం ! ఆవిడకి నేను సరియైన మగాడుగా అనిపించా నెందుకో— నిన్ను నేను నమ్ముకున్నా నన్నది. ఛీఛీ నమ్మకాన్ని వమ్ము చెయ్యనన్నాను నేను. చెయ్యలేను కూడా ! ఏమంటావా? ఆస్తితోపాటు అందమైన ఆడది వచ్చి నిన్నే వెతుక్కుంటున్నా అంటే కాదనేటంత నపుంసకుడను కానుగా ! మేం పెళ్ళిచేసుకోలేదు నిజమే. తెలివితక్కువచేతకాదు. ధైర్యంలేక కాదు. తెలివైనవాళ్లమూ గడుసువాళ్లమూకనుక. పెళ్ళి అనేది తలపెడితే ఆవిడ ఆస్తికి గొడవ వస్తుంది. బహు భార్యాత్వం చట్టవిరుద్ధం. రెండు విధాలా నష్టం." మళ్ళీ శ్రీనివాసులు రామం వంక చూచాడు. రామం నిశ్చలంగా ప్రసన్నంగా వింటున్నాడు.

"మరి సుశీలక్కయ్యని అన్యాయం చెయ్యలేదా! ఆవిడ ఉసూరుమనదూ అంటావు నువ్వు" అని తిరిగి ప్రారంభించాడు శ్రీనివాసులు తన కథనం, నిజానికి రామం ఆమాట అనడు. అది అన్యాయం ఎంత మాత్రంకాదని అతనికప్పుడే స్ఫురించింది. అయినా శ్రీనివాసులు చెప్పనేచెప్పాడు. "మా సంసారం హాయిగా గడిచిపోయే కీలకం ఇదని అర్థంచేసికో గలిగింది సుశీల. అందులో పెద్ద ఔదార్యం, సహన శీలత ఉందనుకోకు. డబ్బు పెట్టుబడిపెట్టేవాడెవ రైనా అడుగులకుమడుగులొత్తేరకం వాళ్లతరహా. సూర్యం కూతురుకదా ! నిజానికి వాళ్ళ నాన్న మూలంగా నాఆస్తిఅంతా తగులబడిందని నాకంటె ఎక్కువ అదే ఏడ్చింది. భూమి అమ్మి తెచ్చిన డబ్బు యిట్టే హరించుకుపోయింది. వరలక్ష్మి ఈ సంసారంలో ప్రవేశించకపోతే మేమూ మీ సూర్యం బాబాయి లానే ఉండేవాళ్ళం. ఇప్పుడా సుశీలకు గాని పిల్లలకుగాని ఏకొరతాలేదు. ఇంటి బరువంతా వరలక్ష్మిచేతిమీదుగానే తొలగింపబడుతూంది.

మనలో మనమాట. ఆడదికదా అసూయపడకుండా ఉంటుందా అని అందరి అనుమానం. సుశీలను గురించి- అసంతృప్తివలన అసూయ ఏర్పడుతుంది. సుశీలకలాంటి అసంతృప్తి లేదు. ఆవిడ స్త్రీత్వం పద్నాలుగేళ్ళ వయస్సునాటినుండీ సఫలమవుతూంది. వరలక్ష్మి ఈ ఇంటికి వచ్చేసరికి సుశీలకు నలుగురు పిల్లలు. ఇప్పుడు సుశీలకు తన పిల్లలు హాయిగా తిని తిరిగి బాగుపడటం కావాలి కాని అసూయతో అర్థాన్ని నెట్టివేయడంకాదు. అందుకొక సుగమమైన మార్గం ఏర్పడిందని లోలోపల సుశీల ఎంతో సంతోషిస్తూంది.

ఈ స్వీయచరిత్ర నింత విప్పిచెబుతున్నా దేమిటి ? ఇందులో తనుచేసిన ఘనకార్యమేమిటి ? డబ్బున్న మనిషి దొరికింది వాడుకుంటున్నాడు అనుకుంటావేమో! ఇందులో నాప్రయోజకత్వం ఉందనికాదు. రామం, ఒక అవకాశాన్ని ఎవ్వరినీ బాధపెట్టకుండా స్వార్థానికి వినియోగించుకున్నా గిలగిలలాడుతుంది లోకం. నన్ను తిట్టి నా గురించి దుష్ప్రచారంచేసే వాళ్ళందరి ఆంతర్యం నాకు తెలుసు. వాళ్ళకీ అలాంటి సదవకాశం రాలేదని వాళ్లేడుస్తున్నారని నాకేకాదు మీ సుశీలక్కయ్యకీ తెలుసు. నిజానికి ఆవిడకున్న పరిజ్ఞానమెంత ? ఊళ్ళో అమ్మలక్కలందరు ఎక్కడ కనిపించినా మీ అక్కయ్యను తెగ ఓదార్చేస్తూంటారు. అంతగా వాళ్లు వాపోతూంటే 'ఆగండి నా భర్త చెడ్డపని చెయ్యలేదు. ధీరుడు, వీరుడు' అని ఎలుగెత్తి చాటే శక్తి ఆవిడ సంస్కారంలో లేదు కాబట్టి వాళ్ళతో తానూ కలిసినట్టే

'ఏదోలెండి ఇదొక కర్మ. ఈనాటి కాయన కలాంటి బుద్ధి పుట్టింది' అని నిట్టూరుస్తుంది. మళ్ళీ ఆవిడే యింటికొచ్చి 'వెధవలు మనం బాగుంటే కళ్లల్లో నిప్పులు పోసుకుంటున్నారు' అంటుంది.

నేనొక లాటరీలో గెలిచాను. వాళ్ళంతా లాటరీ వేసివేసి నష్టపోయారు. నా సమస్తమూ వరలక్ష్మి అదుపులోనే పెట్టాను. తెల్లవారి ఉప్పుకో పప్పుకో అణాకో రూపాయకో ఈ నాలుగు కుటుంబాలలోని మనుష్యులు ఈ యింటికి రాక మానరు. అది అప్పు కాదు. కేవలం ముష్టి. వాళ్లు తినే ప్రతి కానీ 'ఆఎవర్తెదో' అనే సంగతి వాళ్ళ కందరికీ తెలుసు. శ్రీనివాసులు తెచ్చుకున్న ఎవర్తె దగ్గరో వీళ్ళందరూ గడియగడియకీ చెయ్యి చాచుతారు. అలా జరగాలనే నా దగ్గర ఎప్పుడూ దమ్మిడీఉంచను. నేనూ మొన్నపుట్టిన నాపిల్లాడుతో సహా మేమందరం ఆమె పెంపుడు చిలకలం.

బహుశా నీకు ఆశ్చర్యంగా ఉందో లేక మరే మనుకుంటున్నావో. ఇదీ మా కథ" అని ఊరు కున్నాడు శ్రీనివాసులు.

ఇంతకథ వర్ణించిచెప్పినా శ్రీనివాసులు ఎక్కడా ఉద్రేకపడలేదు. ప్రశాంతంగా హాయిగా ఎవరిదో కథ చెప్పినట్లు చెప్పేశాడు.

భూమిమీద జరిగే ప్రతి విషయంగురించీ తెలుసుకోవాలని తహతహపడే కొందరు మరీ ఆసక్తి పరులైన విద్యార్థులుంటారు. అలాంటి విద్యార్థికి మాష్టారు ఒక కొత్తపాఠం చెప్పగానే చెప్పలేని ఆనందం కలుగుతుంది. "నేనేం! ఇవ్వాళ ఎంచక్కటి పాఠం నేర్చుకున్నాను" అని కనిపించిన అందరితోనూ చెపుతాడు. సరిగ్గా ఆ పసివాడి ఆనందం లాంటిదే ఒక అనుభూతి రామానికి కలిగింది. అదీగాక రామానికి యింతవరకూ వ్యక్తులూ ప్రపంచం గురించి లోతుగా చెప్పినవారేలేరు. కుటుంబాల్లో జరిగే చిల్లరచిల్లర సంఘటనలేమైనా అతనికి కుతూహలం కలిగించి "ఏమిటదీ!" అని అడిగితే "నీకెందుకులే ఈ గొడవలన్నీ" అని కసిరే వారు అమ్మా నాన్నాను. ఉద్యోగంలోచేరి డబ్బు సంపాదించడానికీ, పెళ్ళిచేసికుని సంతానం ఉత్పత్తి చేయడానికీ, "ఇంకా చిన్నవాడివిటరా" అని తొందర చేయగలరు. లౌకిక జగత్తులోని తమాషా లను తెలుసుకోవాలంటేమాత్రం అందుకు "చిన్న వాడికి నీకెందుకు?" అంటారు. అలాంటిది శ్రీని వాసులు తన కథనంతటినీ దాపరికం లేకుండా రామానికి చెప్పేసరికి తనకూ ఒక అధిక్యాన్నిచ్చి నట్లు తననొక ఆత్మీయునిగా సంబోధించినట్లూ తోచింది రామానికి. విడని మొగ్గను మంచి వాతా వరణంలో పెడితే విచ్చుకున్నట్లు నిన్నటిదాకా పుస్తకంలో విజ్ఞానం తప్ప మరొకటెరుగని రామా రావుకి ఇవాళ ప్రపంచం గురించి ఎంతో తెలిసి నట్లయింది.

ఆ అనుభూతితో అతను ఉక్కిరి బిక్కిరి అయ్యాడు. శ్రీనివాసులుమీద విపరీతమైన భక్తి భావం కలిగింది. అతనేమీ మాట్లాడలేక పోయాడు. "మళ్ళీ రేపు కనిపిస్తా. నేను వెడతాను బావా!" అని లేచాడు.

"కనబడడమేమిటి? రేపు ఉదయంరా! శేష గిరి దగ్గరకువెళ్ళి సాయంత్రం లోగా ఉద్యోగం ఆర్డరే పట్టుకొద్దాం. ఇంకనుండి ఇక్కడున్న ఐదు కుటుంబాలకూ నువ్వొక ప్లస్ (+). త్వరలోనే వీళ్ళందరూకలిసి నీకో చిన్నదానిని కట్టబెడతారు. 'ఇంకా నయం - ఇంతవరకు చదివించాను, ఇక ఉద్యోగంచెయ్యి, అంటే చెయ్యబోతున్నావాలేదా. అలాగే పెళ్ళిచేసుకో అని మీనాన్న అంటాడు. నువ్వు చేసుకుంటావు. ఈ శ్రేయో రాజ్యంలో స్కూలుఫైనలుగాడికి అరవైయో డెబ్బయ్యో కంటె ఎక్కువిచ్చే బుద్ధిఎవడికీలేదు. శుభం! అదేమీ కాదనను. కాని రామం! గతంలో నువ్వొక పొర పాటుచేశావు. ఇప్పుడు నువ్వు తలదూర్చబోయే గూడుకోసం స్కూలుఫైనలు ఫస్టుమార్కులో పాసవడం అనవసరం. స్కూలులోకల్లా మేథావి కుర్రాడు అనిపించుకోవడం అనవసరం. అభాన్ని

మరొక ఇంగ్లండో, అమెరికాయో పోయేవారికి వదిలేసెయ్యాలిసింది. పోనీలే గతం గతః. ఉద్యోగంలో చేరు. కాని వేంకటేశ్వర్లులా అయిదులూ పదులూ అడగకు. పెళ్ళిచేస్తే చేసేసుకో కాని సుబ్బారావులాంటి కాపురం చెయ్యొద్దు. సరే మీ సూర్యంబాబాయిలా ఎవరిమీదోపడి బతికేయడం మరీ ఘోరం. నీ అరవై రూపాయిలలో నువ్వెంత తింటావో రాబోయే సిరాణీ కెంత పెడతావో, ముందే వాటా వేసేసుకో. అలా బతకలేవూ! శ్రీనివాసుల్లా చెడిపోయి బ్రతికేసేమార్గం చూసుకో. అంతేకాని వాళ్లందరిలా పవిత్రంగా చచ్చిపోకు... పొద్దుట వస్తావుకదూ!" అంటూ సాగనంపాడు శ్రీనివాసులు రామాన్ని.

శ్రీనివాసులు చివరనచెప్పిన మాటలతో రామాని కిందాకటి ఉత్సాహం పొంగు తగ్గిపోయింది. ఒక్కసారిగా తనకేం కాబోతూందో తెలిసినట్లయింది. సూర్యం బాబాయి - చీకటియిల్లూ - ఆ పిల్లలూ - కిందటేడు టైఫాయిడుపడి శల్యపంజరంలా తయారయిన ఐదేళ్ళ అమ్మాయి మరికోలుకోక అలాగే వాడిపోయిన ఆ దైన్యస్థితే - గుర్తుకొచ్చాయి.

మొన్న భోజనాలప్పుడు కాబోలు పిన్నిగారు చెప్పుకొచ్చింది. ఆ అమ్మాయికి టైఫాయిడు వచ్చినప్పుడు నలభై ఎనిమిది రోజులు జ్వరం కాసిందట. ఎంతమంది డాక్టర్లను పిలిచారో ఎంతడబ్బు ఖర్చు పెట్టేరో ఆవిడ వర్ణించలేకపోయింది. ఆమధ్య తన చెల్లెలికి వచ్చింది టైఫాయిడు. కొత్తగా వచ్చిన గొట్టాల మందు వాడేసరికి పది రోజులకి తగ్గిపోయింది.

లేమివల్ల ఆకుటుంబములో ఉన్న హీనస్థితి, దానిని కప్పిపుచ్చుకుంటూ వాళ్ళు బతికే నీచమైన బతుకూ-రామారావుకు భయంకరంగా తోచాయి. అతననుకుంటున్నాడు - లేమివల్ల అందరూ అలాగే తయారవుతారా? అయితే తను? తనగతేమిటి? నాన్న తనకు చూపించే అరవై రూపాయల ఉద్యోగంలో తానెన్నాళ్ళు నిండుగా బ్రతకగలడు? శ్రీనివాసులు చెప్పినట్లు వీళ్లంతా కలిసి తనకెవరినో కట్టబెడితే వద్దనగలడా! అసలు ఉండనే ఉంది మేనమామ కూతురు, వద్దనడానికి తనకి ధైర్యమెక్కడుంది? ఉద్యోగం చేస్తూ నాన్నమీద ఆధారపడడం ఎంత హీనం. శ్రీనివాసులు అన్నట్లు మహా యిస్తే అరవై యిస్తారు. దానితో సంసారం గడుస్తుందా? సూర్యం బాబాయి అంత హీనంగా కాకపోయినా డెభై రూపాయలు తెచ్చుకుంటున్న వెంకటేశ్వర్లు మాత్రం ఎలా బతుకుతున్నాడు? వాళ్ళలా తను సినిమాలకని డబ్బుదుబారాచెయ్యడు కాని ఇంటద్దె సంవత్సరాల కొద్దీ ఎగగొట్ట లేడు, ఎలక్ట్రిసిటీ బిల్లు కట్టకుండా ఉండలేడు. జీతం కాస్తా వాటికే అయిపోతే తనుకూడా పకోడీలు తిని నీళ్ళు తాగి పడుకోవలసిందే. కాని లోకంలో ఎంతమంది అరవైలూ డెభైలూ వచ్చే జీతగాళ్ళు లేరు, వాళ్ళు బతక కేంచేస్తున్నారు? బతుకుతున్నారు. ఇలాగే కాబోలు. కొందరు బతకలేక చస్తున్నారు. కొందరు ఛస్తూ బతుకుతున్నారు. మరికొందరు ఇతరులను చంపి బతుకుతున్నారు. బతుకూ-చావూ-అప్పులూ-లంచాలూ - దగా- మోసం - అబద్ధం-ఏమిటిదంతా? ఇదేబతుకు, అమ్మో బతుకెంత భయంకరం!

మెరుపులూ ఉరుములూలా ప్రశ్నలూ జవాబులూ రామం బుర్రలో తుఫాను లేవదీస్తున్నాయి. ఆ వెలుగుచీకట్లమధ్య భవిష్యత్తునంతా ఒక పటం గీసి పెట్టుకుని అటువైపు చూడటానికే భయపడి పోతున్నాడు రామం. అతనిలో తీవ్రమైన సంచలనం భయం పదేళ్ళ అనుభవంలాంటి ఊహ ఒక్కసారిగా కలిగాయి.

రామం సూర్యంగారింటి గుమ్మం ఎక్కబోతూంటే సందుమలుపు తిరుగుతూ సుబ్బారావు కన్పించాడు. "రారా మాయింటికొకసారి రా! అంటూ పిల్చుకెళ్ళాడు. రామానికేమీ యిష్టంలేకపోయినా తప్పలేదు. వాళ్ళున్న రెండు గదుల వాటాలో వీధిగదిలో తాతలనాటిదొక రోజ్‌వుడ్

కుర్చీ, దానికి రెండుప్రక్కల దంతపుసింహం బుర్రలూ, ఒకమూల ఒక నిలువుటద్దాల బీరువా, నేలమీదొక చిరిగిపోయిన ఖరీదైనతివాసీ ఉన్నాయి. గోడలనిండా రెండు వరసల ఫోటోలున్నాయి. ఇంకా ఖాళీ ఉన్నచోట రెండు మూడేళ్ళనాటి కేలండర్లన్ని ఉన్నాయి. రాజకీయ నాయకులవీ, దేవుళ్ళవీ, కొన్ని సీనరీలవీ ఫోటోలు సమపాళ్ళలో ఉన్నా యా గదిలో. క్రిందటిసారి వచ్చినపుడు వీధరుగుమీదే బాతాఖానీవేసి వెళ్ళాడు రామం. అందుచేత గదిలోపలి పూర్వవైభవాన్ని పరిశీలించే అవకాశం లేకపోయింది.

"రా! మా యిల్లు చూద్దువుగాని" అంటూ ఆ రెండోగదిలోనికికూడా తీసుకువెళ్లాడు రామాన్ని సుబ్బారావు. ఆ గదిలో ఆధునికమైన ఒక డ్రెస్సింగ్ టేబిలూ - అదీ రోజ్‌వుడ్‌దే - దానిమీద స్నోలు పౌడర్లూ, సెంటుబుడ్లూ, అగరువత్తులకు వెండి ఏనుగులు ఉన్నాయి. మరొకపక్క ఒక పెద్ద పట్టెమంచం, గోడలకు ఎన్‌లార్జి చేసిన సినిమా తారల ఫోటోలు ఉన్నాయి. మొత్తంమీద పాత కొత్తల మేలుకలయికతో వెలిసిన పడకగది అది. రామానికి అందులోని యింపు సొంపుల గురించి తెలియదు కాని సుబ్బారావు జీవితం ఎంత ఖరీదైనదో కొంచెం అర్థం చేసి కోడానికి ప్రయత్నించాడు. వంటిల్లు అనబడే చిన్న కొట్లో వంటచేస్తున్న చిన్నదానిని పిలిచి సుబ్బా రావు "టిఫినూ కాఫీ యియ్యవే" అన్నాడు. ఆవిడ వయ్యారంగా ఒకసారి లోపలికివెళ్ళి మళ్ళీ ఇవతల కొచ్చి ముసిముసి నవ్వులు నవ్వుతూ "ఇంత రాత్రవుతూంది భోజనం ముందు టిఫినూ కాఫీ యేమిటండి! నిమ్మకాయ రసం తెస్తాను" అంటూ తెచ్చిచ్చింది. ఇంతాచేసి అప్పుడు సాయంత్రం ఆరు గంటలే అయింది. చేదూ తీపి పులుపు సమ్మిశ్రిత మయిన ఆ పానీయం రామారావు గొంతు దిగలేక దిగలేక దిగింది.

"ఏరా రామం! సూర్యం బాబాయిగారింట్లో ఛీప్ గెస్ట్‌గా వచ్చి దిగావు. మా యింట ఒక పూటైనా భోజనం చెయ్యనేలేదు. పోనీలేగాని సినిమాకైనా వెళదాం వస్తావా! పరీక్ష పాసయావు - పట్నం వచ్చావు. ఒక్క సినిమా యైనా చూడకపోతే ఏలాగరా!" అని కదిపాడు సుబ్బారావు

ఆ క్షణాన ఏమనిపించిందో కాని రామానికి, అవును ఎందుకు వెళ్లకూడదూ! అసలే మనస్సంతా చికాకుగా ఉంది. అనుకుని "పద పోదాం" అనే శాడు. సుబ్బారావు ఎగిరి గంతేసినంత పనిచేసి "సీతా! సీతా! ఒక్క నిముషంలో రెడీ అవు! సినిమాకి వెళ్లాలి" అంటూ తొందరచేశాడు. ఆవిడ ఎప్పుడూ తయారుగా ఉంటుంది కనుక వెంటనే బయలుదేరారు.

తోవలో వెంకటేశ్వర్లు యింటిముందు నుంచి వస్తూ అతనినికూడా కేకవేశాడు సుబ్బారావు. "సినిమాకా! నేనూ అదే అనుకుంటున్నాను" అంటూ బయలుదేరే డతనుకూడా.

అందరూ కలిసి హాలుదగ్గరికి వెళ్ళాక అందరూ జేబుల్లో చేతులుపెట్టారు. సుబ్బారావు "అరే పర్సు మరిచి పోయానోయ్ టైమయిపోతూందనే తొందరలో వచ్చేశాను. వేంకటేశ్వర్లూ నువ్వు తీసుకో టిక్కట్లు" అన్నాడు. వెంకటేశ్వర్లు జేబులోనుండి ఒక్కరూపాయతీసి "ఇంతే ఉంది. నేను వీధిలోకి వచ్చేదాకా మనమంతా కలిసి బయలుదేరుతామని తెలీదుకదూ" అంటూ ఆరూపాయి మళ్ళీ జేబులో పెట్టేశాడు. రామానికి పదిరూపాయలనోటు మార్చి అందరికీ టిక్కట్లుకొనక తప్పలేదు.

సినిమా అయిపోయేలోపున సోడావాడిని పిలిచారు. కిల్లీలవాడిని సిగరెట్లవాడిని పిలిచారు. పకోడీలు కొనితింటూ సినిమాచూశారు. అన్నిటికీ రామం మార్చిన పదిరూపాయలనోటు సరిపోయింది. పకోడీలుతింటూ సీత కళ్ళమ్మట నీరుకార్చేసింది. "అదేమిటి సీతా, కారంగా ఉన్నాయా" కంగారుగా

అడిగాడు సుబ్బారావు. "లేదండి! అబ్బ వాళ్ళఎడ బాటు చూడలేకుండా ఉన్నానండీ" అన్నది చివరకి కథ సుఖాంతమయింది. "అబ్బ! ఎంత బావుందండీ ఆహీరోయినూ" అంది సీత ఇంటికివస్తూ తోవలో. హీరోయిణ మాటకేంగాని "పకోడీలు మంచివి అమ్ముతాడోయ్ సినిమాలో" అన్నాడు వెంక టేశ్వర్లు. తనయింటి వేపు వెళ్లిపోతూ సుబ్బారావు "థేంక్సు రామం, మంచిసినిమా చూపించావు" అన్నాడు.

రామారావుకి తలతిరిగిపోయింది. సినిమాలో ఏంజరిగిందో తనకి తెలియదు. జరిగిన తతంగంతో అతనికి నీరసమొచ్చింది. అతను పకోడీలు తినలేదు. సోడా తాగలేదు. ఆకలివేస్తూంది. కాళ్ళీడ్చు కుంటూ యింటికి వచ్చేసరికి అందరూ నిద్రపోతు న్నారు. అరగంట బాదితే కాని తలుపెవరూ తియ్య లేదు. "పిన్నిగారూ అప్పుడే పడుకున్నారా! వాళ్ళంతా బలవంతంచేస్తే సినిమాకి వెళ్ళాను. మీకు యింతరాత్రయాక శ్రమ" అన్నాడు.

"శ్రమకేముందిలే నాయనా తలుపు తియ్య డానికేం కష్టపడాలి" అందావిడ. "అదికాదు. ఇంతరాత్రయాక వడ్డించడం అదీ..."

"అదేమిటి? భోజనం చేయలేదూ! మాకిష్టుకు నువ్వు శ్రీనివాసులింట్లో ఉన్నావని చెప్పాడు. అక్కడే భోజనం చేస్తావనుకున్నాను. అయ్యో పిచ్చితండ్రీ! ఇంత మజ్జిగైనా తాగు" అంటూ సగం కళాయిపోయిన గళాసుతో వేసవికాలపు మజ్జిగ తెచ్చిచ్చింది. రామం కళ్ళుమూసుకుని గడ గడా తాగేసి ఉస్సురంటూ వీధరుగుమీద పక్క వడేసుకుని కడుపులో కాళ్ళు పెట్టుకుని పడు కున్నాడు.

మర్నాడు ఉదయం పదిగంటలయినప్పటినుండీ రామంకోసం ఎదురుచూస్తున్నాడు శ్రీనివాసులు. ఇద్దరూకలిసి శేషగిరి దగ్గరకువెళ్లాలి. రామం ఒక అరగంట లేటుగా వచ్చాడు. రావడం రావడం ఒక్కడూ రాలేదు. పెట్టె పరుపుతోసహా వచ్చాడు. కళ్ళు లోతుకుపోయాయి. ముఖంపీక్కుపోయింది. ఒక్కరోజుకి జబ్బుచేసినట్టు తయారయాడు.

"అదేమిటిరా ఆ వాలకం!" అన్నాడు శ్రీనివాసులు.

"వళ్లు బాగులేదు బావా! ఇంటికి వెళు తున్నాను మళ్ళీవస్తాను" అన్నాడు.

"జ్వరంవచ్చిందా ఏమిటిరా! ఇలాఉండి నువ్వు ప్రయాణం ఏంచేస్తావు!"

"ఫరవాలేదు - ఇక్కడింక ఉండలేను - ఇంటికి వెళ్లిపోతాను." వరలక్ష్మివచ్చింది. "నేను వెళు తున్నానండీ అక్కయ్యగారూ" అన్నాడు రామా రావు.

"వింటున్నా! వళ్ళు బాగులేదుటకదూ" అని "ఎప్పుడూ ఇల్లువిడిచి లేడేమోనండీ బెంగపడి నట్టున్నాడు" అంది శ్రీనివాసులువైపు తిరిగి.

రామానికి ఆవిడతో ఏదైనా మాట్లాడాలని పించింది. "ఇల్లువిడవడంవల్ల కాదక్కయ్యగారూ! ఈ వూరు మనుష్యులను చూస్తేనే జబ్బుచేస్తుంది." అన్నాడు సాహసించి. వరలక్ష్మి "ఏమిటది" అన్నట్లు చూసింది శ్రీనివాసులు వైపు.

శ్రీనివాసులు ఏమీ పట్టించుకోనట్లే "అదా జబ్బు! అయితే మనవాడు బాగుపడతాడులే. అయినా జబ్బుమనుష్యులకు దూరంగా ఉండడంరా అబ్బాయి! నువ్వు చేయవలసినపని. వాళ్ళనుచూసి నువ్వు జబ్బుపడితే ఎలా? అన్నాడు

"దూరంగా ఉండడానికే బావా ఈప్రయత్నం" అని వెళతా నక్కయ్యగారూ! మళ్ళీ ఈ ఊరు వస్తే మీ యింట్లోనే నామకాం. సుశీలక్కయ్యేది? చెప్పేసి వెళతాను టైమయింది"అన్నాడు రామం. అందరితో చెప్పడాలయేక రామం రిక్షా కదిలింది.

* * *

"అదేమిటిరా! ఎవరు నూరిపోశారు నీ కీ బుద్ధులు? ఇంకా ఏంచదువుతావురా! నీతలకాయ!" అంటూ విరుచుకుపడ్డాడు రామచంద్రయ్య. రామా

రావు ఊరికి వెళ్ళివచ్చిన ఫలితంగా ఒక కొత్త నిశ్చయాన్ని వెలిబుచ్చేసరికి.

"ఎవ్వరూ ఏమీ నూరిపొయ్యలేదు నాన్నా ! నాకు అప్పుడే ఉద్యోగం చెయ్యాలని లేదు. నేను చదువుకుంటాను." అన్నాడు రామారావు మళ్ళీ అవేమాటలు నొక్కిచెబుతూ. "నేను ఏ వయస్సులో మేష్టరీ మొదలు పెట్టానో తెలుసునా ! అప్పుడే చెయ్యనంటున్నావు. ఏడాదిదాటితే నీకు మైనారిటీ వెళుతుంది తెలుసునా ! ఇంకా చిన్నవాడినను కుంటున్నావుటరా అబ్బాయి !"

"పోనిలెండీ ! వాడు చిన్నవాడు కాక పెద్దవాడటండీ ! అసలు చిన్నయినా పెద్దయినా వాడొక్కడే కదుటండీ మొగ కుర్రాడు ? వాడి సరదాయే తీరనివ్వకూడదూ !"అంటూ సాగదీసింది రామంతల్లి పార్వతమ్మ.

"సరి! నువ్వుకూడా బయలుదేరావు వాడిని వెన కేసుకుని.చదువుచదువంటారు.ఇంకోపదేళ్ళుచదువులకు తగలబెట్టి దివాలా తీసేకంటె ఇప్పటి నుండీ తృణమో పణమో ఆర్జించుకోవటం మేలుకాదూ ! అయినా ఎవరిని ఉద్ధరించడానికి చదువులు !"

"డబ్బుఖర్చుకు నాన్నగారు వెనుకతీస్తే నేనే ఎలాగో ఏర్పాటు చేసుకుని చదువుకుంటాను. ఆయన 'ఊ' అంటేచాలు అంటున్నాడు వాడు" అంది పార్వతమ్మ.

"అలాకూడా అన్నాడు ! వీడికి పట్నంవెళ్లేక బుర్ర తిరిగిపోయింది, పోనీలే - ఏదో అఘోరించమను. ఎక్కడ చేరుతాడో చేరమను."

అక్కడే నిల్చుంటె యింకా తండ్రి ఏమంటాడో అని వీధిలోకి జారుకుంటూన్న రామానికి తండ్రి పార్వతమ్మతో అన్న చివరిమాటలు విన్పించాయి.

మునిమాపు వేళ చెఱువుగట్టుమీదకూర్చుని ఆకాశంవంకా, పారిపోయే పక్షులవంకా చూస్తూరామం తన గురించే ఆలోచించుకుంటున్నాడు. అక్కడ లేని నాన్నతో ఏకాంతంగా ఏదో చెబుతున్నాడు. "నాన్నా నీకు ఏమని చెప్పాలో నాకు తెలియదు. కాని నేనెవర్నీ ఉద్ధరిద్దామనీ, ఏదో ఘన కార్యం చేద్దామనీ చదువుతాననడంలేదు. నువ్వన్నట్లు పట్నం వెళ్ళాక - బురదనీటి గుంటలో కప్పల్లా ఒకళ్ళ నొకళ్ళు కరుచుకుంటూ, కబళిస్తూ బతికే ఆ మనుష్యులు ఆవాతావరణం చూచేసరికి-వాతల తిరిగిపోయింది. చదివేసి పెద్ద ఉద్యోగాలు చేస్తాననే నమ్మకంలేదు. నేనెందుకు చదువుతా నంటున్నాను! జీవితంనుండి తప్పించుకుందుకు. ఆకాశంలో పక్షిలా వీలైనన్నాళ్ళు స్వేచ్ఛగా బ్రతకడానికి-నీకు తెలియదులే నాన్నా ! అక్కడ ఉన్న అద్భుతశక్తులు శ్రీనివాసులు వరలక్ష్మి వాళ్ళకథ: సూర్యం బాబాయి. పిల్లలపోరు, శైఫాయిడు అస్థిపంజరం; సుబ్బారావు వెంకటేశ్వర్లు దగాలు డాబులు వీళ్ళే యివే నాకళ్ళు తెరిపించాయని నీకెలా చెప్పగలను? ఇప్పుడు తెరుచుకున్న కళ్ళతో మరొక్కసారి ప్రపంచాన్ని జాగ్రత్తగా పరిశీలించి నాస్థానం ఎక్కడో నేనేం చెయ్యాలో నిర్ణయించుకోవాలి. అందుకు వ్యవధికోసమే ఈ చదువు."

# మహాయాన బౌద్ధ సాహిత్యము | వాడ్రేవు పతంజలి

జన్మభూమిలో ఉత్పన్నమైన బౌద్ధసాహిత్యం తాను పరిఢవిల్లిన ప్రతిదేశంలో ఆదేశపు సంప్రదాయానుగుణంగా అద్భుతమైన సాహితీసృష్టికి దోహదంచేసినది. త్రిపిటకాలు ఆనాటివారి మత, సాంఘిక, ఆర్థిక పరిస్థితులను తెలియజేసే చక్కని గ్రంథాలు. క్రీ. పూ. అయిదవ శతాబ్దినుంచి క్రీ. శ. అయిదవశతాబ్ది మధ్యకాలంనాటి మనకు అలభ్యమైన భారతీయ సాంఘికచరిత్ర త్రిపిటకాలలో లభ్యమవుతున్నది. సింహళదేశపు చరిత్రలైన దీపవంశ, మహావంశవంటి గ్రంథాలనుబట్టి బుద్ధభగవానునికి సుమారు మూడువందల ముప్పది సంవత్సరాలు తర్వాతనే త్రిపిటకాలు, వాటిమీది వ్యాఖ్యానాలూ మొట్టమొదటగా సంకలించబడినవని తెలుస్తున్నది. నాటిమొదలు శతాబ్దాల పర్యంతమూ బౌద్ధమత విశ్వాసంగల అనేకదేశాలలో వివిధశాఖలలో శతసహస్రాధిక గ్రంథాలు విరచించబడుతూనే ఉన్నవి.

అయితే హీనయాన బౌద్ధులవలె మహాయానులు తమ సూత్రాలనుగాని, ఇతరసాహిత్యాన్ని గాని క్రమబద్ధంగా క్రోడీకరించుకొనడంగాని, ప్రక్షిప్తం చేసికొనడంగాని లేదు. హీనయానానికి సంబంధించినంతవరకు ప్రధానమైన ధర్మసూత్రాలు ఏదేశంలోనయినా దాదాపు ఒకేరీతిగా ఉంటాయి. మహాయానంలో ఒకేసూత్రం వివిధరూపాలలో ఆయాదేశాల భాషలలో వెలిసింది. మహాయాన బౌద్ధసాహిత్యం ఏమి అని ప్రశ్నించినవారికి నాలుగు భాషలలోగల బౌద్ధసాహిత్యాన్ని పరిశీలించినగాని సమాధానంరాదు. ఆయా కాలాలలో రచించబడిన మూలసంస్కృత గ్రంథాలు కొన్ని ఈనాడు మనకు లుప్తమై, వాటి టిబెత్తు, చైనా, జపాను భాషాంతరీకరణాలలో, రూపాలలో మాత్రం లభ్యమవుతున్నవి. స్థానికభాషలోనే ధర్మబోధ జరగాలెనని బుద్ధదేవుడు నిర్దేశించినా, అఖిల భారత ప్రచారమూ, పండితుల మన్ననలూ ఆశించి మహాయానులు తమగ్రంథాలను సంస్కృతంలోనే వ్రాసుకొన్నారు. వారిని అనుకరించిగాని, స్వబుద్ధితోగాని సంస్కృతంలో గ్రంథాలువ్రాసిన హీనయాన బౌద్ధతాత్త్వికులుకూడ లేకపోలేదు.

మహాయాన బౌద్ధమతంలో, ఆమత ప్రాచుర్యానికి అత్యధికంగా కృషి సల్పినవారిలో ప్రముఖులైన ఆర్యనాగార్జునుడు, అశ్వఘోషుడు, వసుబంధుడు, దిఙ్నాగుడు, ఆర్యదేవుడు, ధర్మకీర్తివంటి మహామేధావులనుగూర్చి చెప్పుకొనడమంటే మహాయాన బౌద్ధసాహిత్య భాండారాన్నిగూర్చి ముచ్చటించినట్టే అవుతుంది. మహాయాన బౌద్ధసాహితీ కృషీవలులంతా సంస్కృత భాషా క్షేత్రంలో పరిశ్రమించినవారే.

ఆర్యనాగార్జునుని కాలంనాడు (క్రీ.శ. రెండవ శతాబ్ది) సూత్రాలు సంకలనం చేయడమూ, వ్యాఖ్యానాలు వ్రాయడమూ బౌద్ధుల ముఖ్య కార్యక్రమమయింది. వచనంలోవున్న సూత్రాలను ఆర్యనాగార్జునుడు అనుష్టుప్ ఛందంలో కారికలుగా మాధ్యమిక శాస్త్రంలో క్రోడీకరించడంతో, తరువాతి వారయిన ఆర్యదేవుడు, అసంగుడు, వసుబంధుడు, ధర్మకీర్తి మొదలైనవారు ఆయనను అనుసరించి తమ గ్రంథాలుకూడా కారికలుగానే వ్రాశారు. మాధ్యమిక శాస్త్రం మహాయాన గ్రంథమే అయినప్పటికీ అన్ని సంప్రదా

యాల బౌద్ధులకూ శిరోధార్యమై నిలిచినది. నాగార్జునుడు ఉల్లేఖించిన అనేకమైన ఉత్కృష్ట తాత్త్విక గ్రంథాలవలన భారతదేశంలో తాత్త్విక వాఙ్మయసృష్టికి ఆయనే మూలపురుషుడనే కీర్తి నిలిచిపోయింది. ఈయనవంటి విశిష్టమైన తాత్త్వికుని ప్రపంచం మరి చూడలేదనీ, అందువలన ఆయన కేవలం ఊహామాత్రుడేమోననీ కూడా కొందరు పాశ్చాత్యులు తమ అభిప్రాయం వెలిబుచ్చారు.

బుద్ధచరిత, సౌందరనందము మొదలైన ఉత్తమ కావ్యకర్తగా మనం అశ్వఘోషుని గూర్చి విన్నాము. మనకు తెలిసినంతవరకు సంస్కృత భాషలో ప్రప్రథమ నాటకం 'శారిపుత్ర ప్రకరణం' వ్రాసినదీ అశ్వఘోషుడే. ఇవిగాక ఉపనిషత్తులతో సరితూగగల మహాయాన శ్రద్ధోత్పత్తి శాస్త్రమనే మరొక అత్యుత్కృష్ట తత్వశాస్త్ర గ్రంథమూ వ్రాశాడు. కనిష్కునికి సమకాలికుడైన ఈ ప్రజ్ఞానిధి ఆ కాలంలో సమావేశమైన బౌద్ధ సంగీతికి ఉపాధ్యక్షుడుగా, ముఖ్యలేఖకుడుగా పనిచేశాడు.

మైత్రేయనాథుని యోగాచార మహాయాన శాఖకు పరమపవిత్రమైన 'విజ్ఞప్తి మాత్రతాసిద్ధి' అనే గ్రంథం వ్రాసినవాడు వసుబంధుడు. ఈ వసుబంధునినే నాగార్జున, ఆర్యదేవ, అసంగ, ధర్మకీర్తి, దిఙ్నాగులతోపాటు టిబెత్తువారు జంబూద్వీప రత్నషట్కంలో ఒకనిగా పేర్కొన్నారు. బౌద్ధతత్త్వానికి సంబంధించినంతవరకు విజ్ఞాన సర్వస్వమనదగిన 'అభిధర్మ కోశ'మనే మహా గ్రంథంకూడా ఈయనే వ్రాశాడు. సాంఖ్యవాదాన్ని ఖండిస్తూ వసుబంధుడు 'సాంఖ్యసప్తతి' అనే మరొక గ్రంథం వ్రాశాడు. సద్ధర్మ పుండరీకానికీ, మహాపరి నిర్వాణ సూత్రానికీ, వజ్రచ్ఛేదికా ప్రజ్ఞా పారమిత సూత్రానికీ గొప్ప వ్యాఖ్యా గ్రంథాలుకూడా వసుబంధుడు వ్రాశాడు.

మొదట హీనయాన బౌద్ధుడయినా, పిదప మహాయాన సంప్రదాయాలకు ముగ్ధుడై, స్వీకరించి బౌద్ధమతానికేకాక భారతదేశానికే అపారమైన కీర్తి ప్రతిష్ఠలు సంపాదించి పెట్టిన తర్కశాస్త్ర గ్రంథాలు ప్రసాదించాడు దిఙ్నాగుడు. దక్షిణ భారతంలోని కాంచీనగర వాసుడైన (ఈయన ఆంధ్రుడనే వాద మొకటి ప్రబలి వున్నది) ఈయన వ్రాసిన గ్రంథాలలో ప్రమాణ సముచ్చయము, న్యాయప్రవేశము, హేతుచక్ర డమరుకము, ఆలంబన పరీక్ష మొదలైనవి ప్రముఖంగా పేర్కొనబడినవి.

తర్క విద్యలో దాదాపు ఇంతటి ప్రాముఖ్యాన్నీ పొందిన ధర్మకీర్తి మన తిరుపతి వాడు. ఈయన వ్రాసిన 'ప్రమాణ వార్తిక' మనే అత్యుత్తమ గ్రంథాన్ని ఇటీవలనే టిబెత్తునుండి రాహుల్ సాంకృత్యాయన్ అనే ప్రసిద్ధ పండితు లొకరు సంగ్రహించారు. అది వరకు, తర్కశాస్త్రగ్రంథాలలో మకుటాయమానమైన ఈ గ్రంథం లభ్యంకానందుకు భారతీయతర్కపండితులు ఎంతగానో ఖేద పడ్డారు. ప్రమాణ వినిశ్చయము, న్యాయబిందు, సంబంధ పరీక్ష మొదలైనవి ధర్మకీర్తి వ్రాసిన ఇతర గ్రంథాలుగా చెప్పబడుతున్నవి. తరువాతి తరాల వారయిన భారతీయ తార్కికులకు ధర్మకీర్తి మార్గదర్శకుడని అభినుతింపబడినాడు.

ఆర్యదేవుడు ఆర్యనాగార్జునుల అనుగుశిష్యుడు, క్రీ. శ. మూడవ శతాబ్దివాడని వేరొక వాదమూ ఉన్నది. గురువును మించినవా డనిపించుకొనిన మేధానిధి, ఆర్యదేవుడు. ఈయనను గూర్చిన అనేకములైన చిత్రవిచిత్ర గాథలు ప్రచారంలో ఉన్నాయి. ఈయన వ్రాసిన 'అక్షరశతక' మనే మాధ్యమిక శాస్త్రగ్రంథం ప్రస్తుతం టిబెత్తు, చీనా భాషలలో మాత్రమే లభ్యమవుతున్నది. సకల విశ్వాన్నీ జ్యోతిర్మయం చేస్తున్న సూర్య చతుష్టయములో ఆర్యదేవుడు ఒకరుగా పేర్కొనబడినాడు.

ప్రముఖ తాత్త్విక గ్రంథకర్తలైన వీరు వ్రాసినవి కాక, క్రోడీకరింపబడినవీ, ప్రక్షిప్తపరచబడినవీ, కవినామం తెలియనివీ మరికొన్ని

గ్రంథాలు మహాయాన బౌద్ధసాహిత్య భండారంలో మనకు దొరుకుతున్నవి. వారి సూత్రసాహిత్యంలో ప్రముఖమైనవిగా పేర్కొనబడేవి తొమ్మిది గ్రంథాలు: అష్టసాహస్రికా ప్రజ్ఞాపారమిత, సద్ధర్మపుండరీక, లలితవిస్తార, లంకావతార సూత్రము, సువర్ణప్రభాస, గండవ్యూహము, తథాగత గుహ్యక, సమాధి రాజసూత్రము, దశభూమీశ్వర సూత్రము. వీటినే వైపుల్య సూత్రములని కూడా అంటారు. అమితాభ బుద్ధుని ఆరాధనను ప్రేరేపించే సద్ధర్మ పుండరీక సూత్రము చైనా, జపాను, మరికొన్ని ప్రాచ్యదేశాలలో ఈనాటికీ ఎంతో పవిత్రంగా ఎంచబడుతున్నది. హీనయాన బౌద్ధము కేవలం అల్పజ్ఞులకోసమే ఉద్దేశింపబడినదనీ, ఆ విశ్వాసం ప్రకారం సంబుద్ధులైనవారు, బోధిసత్త్వులు కాగోరేవారు మహాయానమునే తరణోపాయంగా స్వీకరించాలెననీ చెబుతుంది. ఈ సూత్రం. దీనిప్రకారం "నమోనమస్ తస్మై అభయందదా అవలోకితేశ్వరాయ బోధిసత్త్వాయ మహాసత్త్వాయ" అని జపించే వారికి ఇహమందు ఏకష్టాలూ కలుగవు.

ధ్యాన, యోగాలను విశ్వసించే యోగాచార మహాయాన వాదులకు లంకావతార సూత్రము పరమపవిత్రమైనది. చిత్తము మాత్రమే సత్యమైనదనీ, తదితరమైనవన్నియు స్వప్నములు, ఎండమావులు, ఆకాశపుష్పములవంటివనీ లంకావతార సూత్రము చెప్పుతున్నది. ఈలంకావతారసూత్రము క్షీణదశకు వచ్చినపిదప మహాయానంలోని శాఖలవారందరకూ, కొందరు హీనయానులకూ శిరోధార్యమనదగిన వజ్రచ్ఛేదికా ప్రజ్ఞాపారమిత సూత్రము దాని స్థాన మాక్రమించి ప్రచారంలోనికి వచ్చినది. ప్రజ్ఞాపారమిత సూత్రాలలోకెల్ల తలమానికమైన ఈసూత్రంలోని పాఠాలను నేటికీ ప్రాచ్యదేశాలబౌద్ధులు నిత్యమూ ఉదయసమయాన పారాయణచేస్తూ ఉంటారు. ఈఉత్కృష్టసూత్రాన్ని ఇటీవల ప్రప్రథమంగా తెలుగువారికి సమర్పించే భాగ్యం నాకుకల్గినది.

ఇవిగాక అనేకమైన కావ్యాలూ, శాస్త్ర గ్రంథాలూ మహాయాన బౌద్ధంనుండి వెలువడ్డాయి. మహావస్తు, లలితవిస్తార మొదలైన బుద్ధదేవుని జీవిత చరిత్ర లున్నాయి. బుద్ధదేవుని నిర్వాణానంతరం సంఘంలో పొడసూపిన అభిప్రాయ భేదాలవలన బయటకు నడచిన మహాసాంఘికుల శాఖకు చెందిన లోకోత్తర వాదులు వినయపిటకాన్ని తిరుగవ్రాసుకొన్నారు. ఆ సంపుటంలోని ప్రథమ గ్రంథమే 'మహావస్తు' లలితవిస్తారాన్ని అధారంగా చేసికొనే సర్ ఎడ్విన్ ఆర్నాల్డు దాదాపు శతాబ్దం క్రితం "ది లైట్ ఆఫ్ ఏషియా" అనే ఇంగ్లీషు కావ్యం వ్రాశారు.

పైని చెప్పిన మహాసాంఘికులే మొదట వైశాలి, పాటలీపుత్రం మొదలైన నగరాలలో వ్యాప్తి చెంది, పిదప ఆంధ్రదేశంలోని అమరావతి, నాగార్జునకొండ ప్రాంతాలకు వలస వచ్చారు. కనీసం రెండు మూడు శతాబ్దాల పర్యంతం భారతదేశంలోని బౌద్ధ తాత్త్విక, సాహితీ కార్యక్రమమంతా కేంద్రీకరింపబడి ఆంధ్రదేశంలో జరిగినదా అనిపించేటంత ప్రముఖస్థానం వహించిన వారెండు విశ్వవిఖ్యాత బౌద్ధకేంద్రాలున్నూ!

# సంపత్కుమార | మబ్బు

పేరాసతో నెల్ల ధారుణి యందున్న అఖిల రసద్రవ్య మాహరించి
ప్రాణులెంతగ గుంజులాడిన రాల్చదు అట్టి ద్రవ్యస్వామి అంశుమాలి,
అతని ఆగారమ్ము నంతయు స్వాధీన మొనరించుకొని తెచ్చి ఒగి సమస్త
బాధిత జీవుల పరముచేసెడు నట్టి దాతృతాపరముడు తాను మబ్బు.
అతని కీర్తించకుండెడు నట్టి వానకోయిలయు నుండునా ? విచ్చుకొనని మొగము
నుండునా ? ధన్యతమము కాకుండు వాణి యుండునా ? ఉండని దాతదొకడెకాని.

స్వాధీన పతిక, భూసతికి జీవనమెల్ల కోరి యిచ్చెడు అనుకూలు డతడు
ఖండితలవు దిశాంగనలను కవుగింట చేర్చి ప్రార్థించు దక్షిణు డతండు
కలహాంతరిత తటి త్కాంత కన్నులు గప్పి తిరుగుళ్లుపోయెడు ధృష్టు డతడు
తా విరహోత్కంఠిత గగనాంగన పీడి స్వచ్ఛందతను జూపు శఠు డతండు
సర్వ శృంగారనాయక సార్వభౌము డమల రసమూర్తి నీప నేత్రాంతవర్తి
కనుల వెక్కసమైన ఆకార సుభగు డంబుదుడు జీవనస్వామి, హర్షభూమి.

అల సాంధ్యకాంతు లంచులజార, నల్లని పట్టు జరీ ముసుం గట్టులగుచు
అచ్ఛన్నమౌ మధ్య మాదిత్యరుచులుగా మెరుగు నీలాల ముక్కరగ నగుచు
దీర్ఘీకృతాంగాగ్రదేశమ్ములన్ వ్రాలు వెల్గులం గ్రొత్త గ్రైవేయమగుచు
మరి నిరస్తద్యుతిమత్తయి గుమ్మగా మూగిన కాటుకముద్ద యగుచు
ఎన్ని ఎన్ని విధాలుగా నెదిగి ఒదిగి వాసరాంగి కలంకార వస్తువితతి
యగుచు నెంతటి క్రొత్తడి అందములను చిమ్మెడు ప్రతిక్షణమ్ము వార్షికము మబ్బు.

ఒక జల్లు వచ్చి మచ్చిక నావరించు ప్రియా ప్రశ్రయోపగూహనము వోలె
ఒక జల్లు వచ్చి దూసుకపోవు దేహాంచలమ్ములన్ బాకులు క్రుమ్మువోలె
ఒక జల్లు తెర వచ్చి సుకుమారముగ తాకు ప్రేయసీగల్లచపేటమువలె
ఒక జల్లు తెర వచ్చి వికటమ్ముగా సాచికొట్టు పెళ్లున దొంగ కొట్టినవలె
ఇట్లు గాకున్న నట్లుగా, నట్లుగాక ఇట్లుగాదోచు జల్లుల కెదురులేదు
పీ జల్లులు సామి ఘటిత తనువునందెల్ల తనదు ముద్రలనువేయు.

మోకాలి చిప్పలు మూసుకపోవు నట్టుల రంగు చీరె చెంగులు బిగించి
మొక్క నాటెడివేళ మోమునపడు ముంగురుల మణికట్లతో త్రోసి త్రోసి
అదుమంగ బడ్డ దేహాంచలా లపుడప్డు చిన్నమెత్తుగ వదుల్ చేసి చేసి
కష్టమ్మునందు సమష్టిగా కమ్మని పాటల మోదమ్ము పంచి పంచి
అల్పమును భూమికిచ్చి, అనల్పమైన 'బ్రదుకు' లోకానికిచ్చెడు పల్లెపడుచు
లందరికి పైన నధికారి యట్టివాడు ఏడ ఎట్టులో, అట్లుండువాడు, మబ్బు.

వాన చిన్కులు మోముపై పడ్డ యంతనే తొడవుల చివరల తుడుచుకొంచు
గుమ్మగా జల్లులు క్రమ్ముకొన్నంతనే 'హేహే' లతో గంతులేసికొనుచు
చూరులలోనుండి ధారలు పడినంత చేతు లడ్డముపెట్టి చిమ్ముకొనుచు
వాన వెలసి కాలువలు కట్టినంత కాగితపు పడవలతోడ గెంతుకొనుచు
వాన మొదలుగ ఆగెడు వరకుగూడ తమదె సౌభాగ్య మెల్లగా దలచునట్టి
పిల్లలందున తానొక్క పిల్లవాడు, వారి ఆనందమయినట్టివాడు, మబ్బు

అచ్చతెల్వి కభిజ్ఞమైన వెగ్గులు గూడుకట్టిన మూర్తిని గ్రమ్మమాయ
కన్నులందున తటిత్ ఖడ్గమ్ము ఝళిపించి నవయింపజేయు మూడవ గుణమ్ము
సత్వస్థితి జ్ఞానసంపాదనము మాన్చి జడరూపమెల్ల గూర్చెడి అవిద్య
ఏగినట్టులె ఏగి జృంభించి పై బలాత్కారమ్ము నెరపు బ్రతారణమ్ము
సర్వకుత్సిత ప్రక్రియాచణము మబ్బు, సర్వలోక ప్రవృత్తి భాసకము మబ్బు
అసలు తత్వమ్ము నెరిగిన యంతలోన తిగిసి నీర్గారి సత్యము తెల్పు మబ్బు

ఒకచోట మబ్బు తానొదుగుచు నెదుగుచు వ్యాపించు 'నవకాశవాది' యట్లు
ఇంకొకచోట తా నేది నమ్మనొ దాని వ్యక్తపరచు 'స్పష్టవాది' మాద్రి
మరియొకచోట కొంపలు గూల్చి పైకి కన్పడకయుండును 'న్యాయవాది' రీతి
వేరొకచోట గుప్పించు నేకత్రితాంతస్నెల్ల తా 'సామ్యవాది' పగిది
ఒకట మిన్నెల్ల అదరగా నుద్ధృత ప్రవర్తనుండయ్యెడును తీవ్రవాది వోలె
వాదములనెల్ల స్వాయత్తపరచుకొన్న మాద్రి లోకదర్పణమయి మసలు మబ్బు.

తనసత్తువేమొ అంతకు నంతకును జారు కాని ఆర్భాట మింతేని విడదు
తనలోనె తాను ఘర్షణ పడుచుండును కాని ప్రచార మింతేని విడదు
తనకేమొ ఆధారమని యేమి లేదును కాని పైకెగురు టింతేని విడదు
తన కాందిశీకత దత్తరపడుచుండు కాని నేతృత్వ మింతేని విడదు
లోన నేమున్నదో యేమొ, కాని పైకి నిండియుండినయట్లు కన్పించుచుండు
అచ్చముగ నేటి రాజకీయజ్ఞువోలె వెలయుచుండును వార్షిక వేళ మబ్బు.

ధ్వనిమార్గ సంచరత్ ప్రౌఢ కవీంద్ర సంగ్రధిత రసోత్త సత్కావ్యమువలె
కృషి కార్యచణ కర్షకీ కర్షక స్వేద సంవర్షిత శ్రీక సస్యమువలె
తృణ్మహాపీడా విదీర్ణ జనార్థ ప్రపాసమాదిత సుధాభాండమువలె
ప్రోషిత భర్తృకా పూర్ణ వాంఛాలోక జాల నీలోత్పల మాలికవలె
విమల వైవిధ్య భావనావృత్త మధుర మధుర రూపాశ్రితుండు, సమస్త హృదయ
శస్త సంపత్ప్రకల్పనాచణుడు, దివ్య వార్షికానంద సంభార వాహి మబ్బు.

## రఘునాథ్ మురళీధర్ జోషి | *బహురూపి

కోల్హాట్కర్ గారి ఈ మరాఠీపుస్తకమును ఈ సంవత్సరము మరాఠీభాషలో రచింపబడిన పుస్తకములలో సర్వోత్తమమైనదిగా నిర్ణయించి, సాహిత్య అకాడమీవారు దానికి బహుమాన మొసంగినారు. అకాడమీ వారినుండి ఈ బహుమానముపొందుట సామాన్యమైన విషయము కాదు కనుక ఈపుస్తకమును గురించి అనేకులకు కుతూహలము గలుగుట స్వాభావికము. మరాఠీ మాతృభాషగాగలవారు గ్రంథము తామే చదువుకొనగలరు. అన్యులు ఏతద్గ్రంథముయొక్క విమర్శనము మాత్రము చదువుకొనగలుగుదురు. గ్రంథములోని సర్వవిషయములు తెలిసికొనవలయునన్న వారికోరిక సఫలమగుట కిచ్చట వీలులేదు. అందుచేత గ్రంథహృదయమునుగూర్చి అధికాధికముగా తెలుపుప్రయత్నము చేయుదును.

ఈగ్రంథమును రచించినవాడు మేధావి. అభినయములో నేర్పరి. నాటకదర్శకుడు. ఒకనాటకసంఘ యాజమాన్యములో భాగస్వామి. ప్రస్తుతము వారివయస్సు దాదాపు డెబ్బదిసంవత్సరము లుండవచ్చును. ఇప్పటివరకును వారినాట్య కళోపాసన నిర్విరామముగా కొనసాగుచున్నది. ఇప్పుడు వారు ధీరోదాత్తనాయకునివేషము వేయలేరు. కాని తమవయస్సుకు తగిన ఏవేషమైనను వేసి ఇప్పటికిని ప్రేక్షకుల ప్రశంసకు పాత్రులు కాగలుగుదురు.

నేటికాలములో విద్యావంతులుగా చెప్పబడుచున్నవారిశ్రేణిలో కోల్హాట్కర్ గారిని చేర్చుటకు వీలులేదు. వారు మెట్రిక్ పరీక్షలోకూడ ఉత్తీర్ణులు కాలేదు. మెట్రిక్ లో చేరుకొనువరకే వారిప్రాణము విసుగెత్తినది. పదిహేడు సంవత్సరముల వయస్సునుండి ఇరువది సంవత్సరముల వయస్సు వచ్చువరకు వీరు కాళోశీ గ్రామములో వ్యవసాయము చేసిరి. వీరి పైతృకమైన వృత్తి ఇదేనేమో అనునంత నేర్పుతో వీరు వ్యవసాయము చేసిరి. కోల్హాట్కర్ గారి కుటుంబము సాతారాజిల్లాలో నివాస మేర్పరచుకొని యుండెను. కాళోశీ సాతారాకు పన్నెండుమైళ్ళదూరము. తండ్రి వీరిశైశవావస్థలోనే కాలము చేసెను. వాత్సల్యాధిక్యముచేత తల్లి వీరిని తన చెప్పుచేతలలో నుంచుకొనజాలక పోయినది. ఆటలాడుట, శరీరబలమును పెంపొందించుకొనుట ఈవైపు వీరిదృష్టి ఎక్కువగా మరలినది. నాటకములు చూచుట పరిపాటియైనది. దానితోపాటు నాటకములలో వేషములు వేయవలయునని మనస్సు లోభపడినది. ఈ సమయములోనే వీరొక నాటకశాల వార్షికోత్సవములో 'ఝుంఝూర్ రావ్' అను నాటకములో నాయకపాత్ర ధరించిరి. ఈ ఝుంఝూర్ రావ్ షేక్స్పియర్ యొక్క 'ఒథెల్లో' నాటకమున కనువాదము ఈ నాటకములో పనిచేసిన ఇతర యువక నటులు

* రచయిత చింతామణ్ గణేశ్ కోల్హాట్కర్. ఎచ్. వి. మోటే ప్రకాశకులు. పుటసంఖ్య 442. మూల్యము 12.50. ఈ సంవత్సరము సాహిత్యఅకాడమీవారు బహుమతులొసంగిన అన్నిగ్రంథముల సమీక్ష ప్రచురించుటకు 'కల్పన' అను హిందీమాసపత్రిక సహకారముతో జయంతి సంకల్పించినది. ఈ వ్యాసము జయంతి కల్పనలలో ఒకేమారు ప్రకటింపబడుచున్నది.—సం. జ.

బౌంబ్ బాంబు కేసులో అరెస్టు చేయబడిరి. నాటకములో వారితో కలిసి పనిచేసిన అపరాధమునకు కోల్హాట్కర్ గారినికూడ కాళోశీ గ్రామములో పోలీసువారు పట్టుకొనిరి. ఎన్ని దెబ్బలు కొట్టినప్పటికి వారివద్దనుండి పోలీసువారికి కావలసిన సమాచార మేమియు లభించలేదు. తుదకు న్యాయాధీశులు వారినివదలిపెట్టిరి. అంతటితో వారి వ్యావసాయిక జీవనము సమాప్తమైనది.

కోల్హాట్కర్ గారు 1911 సంవత్సరములో 'మహారాష్ట్ర నాటకమండలి' అను సంస్థలో ప్రవేశించిరి. ఒకటి తరువాత నొకటిగా వీరనేక సంస్థలలో పనిచేసి 1918 లో ముగ్గురు నటులతో కూడుకొని 'బలవంత్ సంగీత నాటక మండలి'ని స్థాపించిరి. ఈ నాటకమండలి 1933 వరకు మూడుపూవు లారుకాయలుగా సాగినది. దీనితరువాత వీరు చిన్న చిన్న నాటకమండలుల నెన్నింటినో నడిపిరి. కాని, నాట్య, అభినయ, దర్శకత్వాది భిన్నభిన్న రూపములతో నాట్య సరస్వతి నారాధించుటయే వీరు తమ లక్ష్యముగా పెట్టుకొనిరి. మహారాష్ట్ర నాటకసంస్థ లనేకములు పుట్టినవి. మహానటులుకూడ పుట్టినారు. 'బాలగంధర్వ' అను ఉపనామముగల శ్రీనారాయణరావు రాజహంస ప్రసిద్ధనటులు. సమస్త భారతదేశము వీరినెరుగును. వీరు దాదాపు ముప్పది యైదేండ్లవరకు నాట్యోపాసనచేసి తమ శరీర సౌందర్యమును కాపాడుకొనిరి. నిరంతరముగా మధురసంగీతము స్రవింపజేయు తమ కంఠస్వర శోభను రక్షించుకొనిరి. మరియు అభినయమునందుచ్చస్థానము నందుకొనిరి. కాని బాలగంధర్వులు కేవలము స్త్రీపాత్రలే ధరించెడివారు. కోల్హాట్కర్ గారు స్త్రీపాత్రలెప్పుడును ధరించలేదు. సంగీతముతో వారికి సంబంధమేలేదు. వారి రూపమును చూచి మోహింపబడు యవకాశముకూడ లేదు. సర్వంకషమైన కుశాగ్రబుద్ధి, ప్రగతిపథమునందు ప్రయాణము చేయుటకైన నిరంతర పరిశ్రమ, దేశముయొక్క పారతంత్ర్యమునందు ద్వేషము— ఇది వీరి మూలధనము. వీరిని పోలీసులు పట్టుకొన్నప్పుడు దేశమునందు రాజకీయ అసంతృప్తి తీవ్రముగా నుండెను. ఆంగ్లేయుల రాజ్యము ఈ తిరుగుబాటును అణచుటకు మిక్కిలి కఠోరముగా ప్రవర్తించుచుండెను. మహారాష్ట్ర దేశములో జాక్సన్, రాండ్ మొదలైన కలెక్టరులు హత్య గావింపబడిరి. లోకమాన్యతిలక్ ఆరు సంవత్సరముల కొఱకు మాండలే కారాగారమునకు పంపబడిరి. సావర్కర్ గారికి యావజ్జీవ కారాగారశిక్ష విధింపబడినది.

ఈ పుస్తకము మూడు భాగములుగా విభజింపబడినది. మొదటి భాగము పేరు 'స్వగతము'. ఇది కోల్హాట్కర్ గారి ఆత్మకథ. రెండవ భాగము పేరు 'మాఝే నాటక్ కార్' (నా నాటక రచయితలు). తమ కే యే నాటక కర్తలతో సంపర్కము కలిగినదో, ఎవరెవరిని ప్రార్థించి వారు తమకు కావలసిన నాటకములు వ్రాయించుకొన్నారో వారిని గురించిన వర్ణన ఈ భాగమునందున్నది. ఇది పుస్తకము యొక్క గర్భము. ఆత్మకథ డెబ్బది నాలుగు పుటలు వ్యాపింపగా రెండవ భాగము మూడు వందల ముప్పది రెండు పుటలు వ్యాపించినది. మూడవభాగము అనేక విషయ సంకీర్ణము. ఇందులో బలవంత్ నాటక మండలి చరిత్ర, నాటకముల ఆదాయపు లెక్కలు, వార్తాపత్రికలవారు వీరితో కలిసి మాటాడి ప్రకటించిన వీరి భావములు, మరియు వీరి ఒక ఉపన్యాసము —ఇవన్నియు నున్నవి. పుస్తకములో నాటక కర్తల, వారి సంతకముల, ఫోటోబ్లాకులు ముప్పది వరకున్నవి.

కోల్హాట్కర్ గారి రచన విశిష్టమైనది. విశ్వవిద్యాలయములలో శిక్షితులై పదవీ విభూషిత వర్గముగా బయల్వెడలిన వారికి లేఖనము యొక్క విభిన్న లక్షణములను గురించి పాఠము చెప్పబడును. ఇటువంటి సుశిక్షితవ్యక్తులు కొందరు

సాహిత్య సంబంధమైన కొన్ని రచనలు చేయుదురు. కాని ఆ రచన లుచ్చ స్థాయి నందుకొనవు. నిసర్గదత్తమై, మూలభూతమైన కాంతి ఆ రచనలలో మృగ్యము. తన జీవిత మొక మార్గమున బడిపోవుచున్నది. లౌకిక వాతావరణము సుఖదుఃఖ మిశ్రితమైన కొన్ని సంస్కారములను తన బ్రదుకునకు జోడించినది. దానికొక యాకారము ప్రాప్తమైనది. ఆ యాకారమును కోల్హాట్కర్ గారు సుమనోహరముగా వర్ణించినారు. కోల్హాట్కర్ గారి బుద్ధికి అసంగతములు అసాధారణములు నైన సంఘటనలను తొందరగా గ్రహింపగలుగు శక్తి యున్నది. విభిన్న మనోవృత్తులు గలవారి సంపర్కము, సంస్కారక్షమమైన తన మనోధర్మము; వీనియొక్క పరిణామము ఈ గ్రంథమునందు కనపడుచున్నది. కేవల విద్యాధ్యయనము వలన ఈ మానసిక ప్రవృత్తి కలుగుట యసంభవము.

నాటకము సాహిత్యము యొక్క ముఖ్యాంగము. వీరు షేక్స్పియర్ ముప్పదియారు నాటకములు వందసార్లు చదివిరి. వాటిని కంఠస్థము చేసిరి. అర్థమును జీర్ణించుకొనిరి. అభినయము ద్వారా వానిని వ్యక్తముచేసిరి. మరియు వారందురుగదా— నేను మెట్రిక్ పాఠ్యపుస్తకములే చదువలేదు ఇంగ్లీషు నేనెట్లు వ్రాయగలుగుదునని. కార్యమగ్నులై వారనేక స్థానములకు పోయిరి. ఎప్పుడును క్రొత్త నాటకకర్తలను వెదకు ప్రయత్నములో, విఖ్యాత రచయితలతోడనే కాక ప్రతిభాలేశము కనబడినచోట నెల్ల వారితో సంబంధము పెంపొందించుకొనిరి.

కోల్హాట్కర్ గారి కుటుంబము మిక్కిలి పెద్దది. వాని శాఖ లనేకములు కొంకణ్, బొంబాయి, నాగపూరులలో వ్యాపించియుండెను. వీరి పితృవ్యులలో నొకరు, వామనరావు అనువారు, నాగపూరు ప్రాంతములో సెషన్సు జడ్జిగా నుండిరి. వీరి పినతాయనలలో నొకరు, శ్రీపాదకృష్ణ అనువారు, మరాఠీ సాహిత్యములో మిక్కిలి ప్రసిద్ధులు. పినతాయనగారి కుమారులలో నొకరు, అచ్యుత్ బలవంత్ అనువారు, లోకమాన్యతిలక్ గారిశిష్యులు, పత్రికా రచయితలు, వక్తలు. కాని చింతామణ్ గణేశ్ కోల్హాట్కర్ గారు ఈ క్షుణ్ణ మార్గములనన్నింటినివదలి తమకై ఒక క్రొత్తరంగము నెన్నుకొనిరి. నాటకములుచూచుట, వ్రాయుట, వాని నుండి సౌందర్యమును గ్రహించుట ఈ కార్యములెవనికిష్టములుగావు? కాని ఈవృత్తి గౌరవప్రదమైనవృత్తిగా స్వీకరింపబడలేదు. ఈరంగములో ప్రవేశ మొనర్చినవానిని లోకులు హీనుడనుకొనువారు. అందువలన కోల్హాట్కర్ గారి హృదయము చింతామగ్నమై యుండెడిది. ఈపతిత క్షేత్రములో అడుగుపెట్టికూడ ఏదో యొకటి చేసి చూపించవలయునన్న ఇచ్ఛ కోల్హాట్కర్ గారి మనస్సులో నుండెడిది. మనస్సును మోహపెట్టి చెడ్డమార్గము నవలంబింపజేయు సర్వవస్తువులు నాటక కంపెనీలలో సులభముగా లభించును. కాని కోల్హాట్కర్ గారు మిక్కిలి సంయమనము ప్రదర్శించిరి. కొన్ని సంవత్సరముల తరువాత వామనరావుగారు బలవంత్ నాట్యమండలీరంగముపై కోల్హాట్కర్ గారిని ప్రకాశించుచుండగాజూచి గట్టిగా కౌగలించుకొని ఇట్లనిరి, 'నాయనా! నీవు అదృష్టవంతుడవు. ఏరంగములో అడుగుపెట్టినను కోల్హాట్కర్ కోల్హాట్కర్ గానే యుండును. ఇది నాకు గర్వకారణము.'

కోల్హాట్కర్ గారు వ్రాసిన గ్రంథము పేరు బహురూపి. ఆయన పెట్టుకొన్న ఉపనామముకూడ బహురూపి అనియే. నటులు బహురూపులుకదా! మహారాష్ట్రదేశములో 'బహురూపులు' అను వృత్తి గలవారు కొందరుండిరి ఒకరిద్దరు మనుష్యులు ఒకగ్రామమునకుపోయి ఊరిలో తిరిగి సంపన్నులెవరో, ఏకుటుంబము వా రెటువంటివారో తెలిసికొనెడివారు. తరువాత తీరుతీరు వేసములతో ఇంటింటికిపోయి, కొంత ఉపన్యాసము, కొంత సంగీతము, కొంత అభినయము చూపించెడివారు.

వారొకప్పుడు రాజులు, ఒకప్పుడు భిక్షుకులు, ఒకప్పుడు వ్యాపారులు, ఒకప్పుడు సన్యాసులు, తుదకు తమ నిజరూపముతోపోయి యాచనచేసెడి వారు. నలువదియేండ్ల క్రిందివరకు ఇటువంటి కళాకారులు కనపడెడివారు. ఇదియొక మనోహరమైన కళాభివ్యంజనాపద్ధతి. కేవల మొకరిద్దరు మనుష్యులతో కూడుకొనిన నాటకకంపనీ. వారికి రంగభూమి అవసరములేదు. వారిబ్రదుకే యొకరంగభూమి. మానవులందరు ఆరంగభూమిపై అభినయముచేయు నటులు.

కోల్హాట్కర్‌గారికి ఇరువది నలుగురు నాటకకర్తలతో సంపర్కము కలిగినది. గ్రంథకర్తపై ఆయా నాటకకర్తల ప్రభావము ననుసరించి వారి వారికి పుస్తకములలో స్థానమివ్వబడినది. ఒక నాటకకర్తను గురించి ఒకటిన్నరపుటలో వ్రాయబడగా ఇంకొక నాటకకర్తను గురించి నూటముప్పదిమూడు పుటలలో వ్రాయబడినది. కాని ప్రతివ్యక్తినిగురించి వ్రాసినవ్రాత రసవంతముగానున్నదని చెప్పకతప్పదు. రచనాశైలి బాణభట్టుని కాదంబరిలోని వింధ్యాటవీ వర్ణనమువలెనున్నది.

వీరిసంపర్కములోనికి వచ్చిన నాటకకర్తలలో కృష్ణాజీ ప్రభాకర్ ఖాడిల్‌కర్, నరసింహచింతామణ్ కేల్‌కర్, శ్రీపాదకృష్ణ కోల్హాట్కర్‌గారట మరాఠీ సాహిత్య జగత్తునం దగ్రగణ్యులు. అణ్ణాసాహెబ్ కిర్లోస్కర్, గోవింద బల్లాల దేవల్, మరాఠీ నాటకముల కాద్యులు. కాని కోల్హాట్కర్ గారు తమ ప్రీతి సర్వస్వమును ఏ రచయితకై ధారపోసిరో ఆయన వేరేయున్నాడు. ఆయనపేరు రామగణేశ్ గడ్కరీ. ఆయన కొఱకు ఈయన తన గ్రంథములో నూటముప్పది మూడు పుటలు ప్రత్యేకించెను.

కృష్ణాజీ ప్రభాకర్ ఖాడిల్‌కర్ లోకమాన్య తిలక్‌గారి శిష్యులు. కేల్‌కర్, ఖాడిల్‌కర్, వీరిద్దరును తిలక్‌గారి శిక్షణలో పత్రికా రచన నేర్చుకొనిరి. ఖాడిల్‌కర్‌గారు గొప్ప వక్తలు. విద్వాంసులు. రాజనీతి విశారదులు. అభినయమునందుకూడ నిపుణులు. బాలగంధర్వులకు స్త్రీ పాత్రాభినయము వీరే నేర్పిరి. ఖాడిల్‌కర్ గారు ఇరువదియైదుకన్న ఎక్కువ నాటకములు వ్రాసిరి. వీనిలో స్వయంవర్, ద్రౌపది, మానాపమాన్, విద్యాహరణ్, మేనక, కాంచనగడ్ చీమోహనా, భాదోబందకీ మిక్కిలి ప్రసిద్ధములు. తమ నాటకములలో వీరు నాటి రాజ్యవ్యవస్థను తీవ్రముగా నిరసించెడివారు. వీరి 'కీచకవధ' నాటకములో కర్జన్ రాజ్యమునుగురించిన తీవ్ర నిరసనముండుటచేత అది ప్రకటింపబడిన వెంటనే సర్కారువారు దానిని జప్తుచేసికొనిరి. స్వాతంత్ర్య ప్రాప్తి తరువాతకాని ఈ నాటకము ప్రదర్శించుటకు వీలుకలుగలేదు. వీరి విద్యాహరణ్ నాటకము కోల్హాట్కర్ గారిచేత ప్రదర్శింపబడినది. ఖాడిల్‌కర్‌గారు మిక్కిలి గంభీరులు, ఆలోచనాపరులు. ఎన్. సి. కేల్‌కర్ (నరసింహ చింతామణ్ కేల్‌కర్) గారికి వీరికి కొన్ని మనస్పర్థలుండెడివి. కాని కేల్‌కర్‌గారిని గురించి మాట్లాడినపుడెల్ల వారు గౌరవముగా మాట్లాడెడివారు. విరోధమును సూచించు ఒక్కశబ్దముకూడ వారినోటి నుండి వెలువడెడిదికాదు. కోల్హాట్కర్‌గారి అభినయము, వారి దర్శకత్వము చూచి, ఖాడిల్‌కర్ మిక్కిలి సంతోషించెడివారు.

ఎన్. సి. కేల్‌కర్ మహారాష్ట్ర దేశములో గొప్పనాయకులు. వారితోకూడ కోల్హాట్కర్‌గారికి సంపర్కము కలిగినది. మూడవపానీపత్ (1761) యుద్ధములో మహారాష్ట్రులకు గొప్పపరాభవము జరిగినది. ఆ సమయములో సదాశివరావు భావు మహారాష్ట్రుల సేనాపతిగా నుండెను. ఈ సేనాపతి కూడ యుద్ధములో చనిపోయియుండవచ్చును. కాని ఈయన శవము యుద్ధభూమిలో దొరుకలేదు. తరువాత సుఖనిధాన్ అనునొక కాన్యకుబ్జుడు తనపేరు సదాశివరావు అనిచెప్పుకొని

దక్షిణదేశమునకు వచ్చెను. దీని నితివృత్తముగా గైకొని కేల్కర్ గారొక నాటకమును రచించిరి. ఈ నాటకములోసుఖనిధానునిపాత్ర కోల్హాట్కర్ గారు మిక్కిలి సామర్థ్యముతో ధరించిరి. కేల్కర్ గారితో 'వీరవిడంబన' అను ఒకనాటకము ప్రత్యేకముగా తమ నాటకమండలికొఱకు వీరు వ్రాయించుకొనిరి. మహాభారతాంతర్గతమైన ఉత్తరగోగ్రహణ కథ ఈ నాటకమునందలి ఇతివృత్తము. ఈ నాటకములో కోల్హాట్కర్ గారు భీముని పాత్ర ధరించెడివారు. నాటకప్రదర్శనము మిక్కిలి ఫలవంతమైనది కాని కేల్కర్ గారు అధికముగా ప్రసన్నులు కాలేదు. కేల్కర్ గారు మహారాష్ట్రసాహిత్యమునకు సమ్రాట్టులుగా చెప్పబడుదురు. సర్వసాహిత్య శాఖ లన్నింటిలో వారుద్దండులు. కాని వారికొక విధమైన యహంభావముండెడిది. కోల్హాట్కర్ గారికి కూడ దాని ఫలిత మనుభవింపవలసివచ్చినది. 1923-24 లో జరిగిన ఒక సంఘటనను దృష్టాంతముగా చూపి కోల్హాట్కర్ గారు తమ యభిప్రాయమును సమర్థించుకొనిరి. పండరిపురములో బలవంత్ నాటకమండలివారు నాటకప్రదర్శనములు జరుపుచుండిరి. అప్పుడు కంపనీ మిక్కిలి సంపన్నదశలో నుండెను. కేల్కర్ గారి ఆగమన వార్త విని కోల్హాట్కర్ గారు వారి దర్శనమునకై వారి నివాసస్థానమునకుపోయిరి. గృహయజమాని కోల్హాట్కర్ గారికి స్వాగతమొసగి కేల్కర్ గారు కూర్చున్న గదిలోనికి తీసికొనిపోయి వారివద్దనే కూర్చుండ బెట్టిరి. నమస్కారోభయకుశలోపరి కేల్కర్ గారు ముఖము ముడుచుకొని ఇట్లనిరి. "నేను కొంచెము పనిలోనున్నాను. మీ రా ప్రక్క గదిలో వేచియుండుడు."

కోల్హాట్కర్ గారు ఇతర నాటకకర్తలనుగురించి కూడ మిక్కిలి ఆదరముతో వ్రాసినారు. ఆ నాటక కర్తలలో బారిస్టర్ సావర్కర్, మరియు వాసుదేవశాస్త్రిఖరేగారు కూడ నున్నారు. కంపెనీవారు రత్నగిరిలో నాటకములాడుచున్నపుడు సావర్కర్ గారు అక్కడ నజర్ బందీలో నుండిరి. తమ బృందముతో పాటు కోల్హాట్కర్ గారు సావర్కర్ గారిని దర్శించిరి. సావర్కర్ గారెట్లువచ్చినది, వారేబట్టలు తొడుగుకొనినది, ఎట్లు మాట్లాడినది, అంతయు పరమాదరముతో చిత్రకారునివలె చిత్రించినారు. వారు ప్రతి శబ్దమును తూచి వాడుచుండిరనియు; ప్రత్యక్షరము లయబద్ధమై, బాగుగా ఉచ్చరింపబడుచుండినదనియు వీరు వ్రాసినారు. ఇంతకు వారు పోయినది ఒకనాటకము వ్రాసి ఇవ్వవలసినదని యాచించుటకు. సావర్కర్ గారు నాటకము వ్రాసిరి కూడ. పేరు 'సన్న్యస్త ఖడ్గము'. కథ అశోకుని కాలము నాటిది. అహింసా వాదుల దళ మొకటి యుద్ధ వాదుల దళ మింకొకటి. అహింసా వాదుల దళమొక బౌద్ధ సన్యాసి ఆదేశములను పాలించుచుండెడిది. శత్రువులు వినాశనమునకై కాలుద్రువ్వుచుండిరి. ఆ పక్షమునుండి రాయబారము వచ్చెను-శరణాగతులు కండు, లేనిచో మిమ్ము సర్వనాశనము చేసెదమని. అహింసావాదులరాజు వల్లభసింహుడు. సేనాపతి విక్రమసింహుడు. రాజు యుద్ధమున కనుజ్ఞ యివ్వవలయునని విక్రమసింహుడు మిక్కిలి ఉత్కంఠతో వేచియుండెను. వల్లభసింహుని భార్య సులోచనాదేవి పురుష వేషముతో రాజాస్థానమునందు పవిష్టురాలైయుండెను. ఆమె లేచి రాయబారమునకు ప్రత్యుత్తరమిచ్చెను. 'పోరాడుచు మరణించుట సమ్మతమే. కాని శరణాగతులము కాము' అని. నాగపూర్ లో ఈ నాటకమాడుచుండిరి. నాటక మందిరమంతయు ఎక్కడిదక్కడ నిశ్శబ్దముగా నుండెను. ప్రేక్షకులలో ప్రసిద్ధికెక్కిన గాంధీవాదులు నారాయణరావుఖరేగారుకూడ ఉండిరి. సులోచనాదేవి నోటినుండి ఈ మాటలు వెలువడుటతోనే వారకస్మాత్తుగా లేచినిలబడి ఆవేశముతో ఇట్లనిరి. 'అంతే ఎవడో యొకడు ఈ యుద్ధభేరి మ్రోగింపవలసినదే' అని. ఇటువంటివే రెండుమూడు అనుభవములను కోల్హాట్కర్ గారు చిత్రించినారు.

రామగణేశ్ గడ్కరీ మరాఠీ సాహిత్యములో అద్వితీయుడు. ఆయన ముప్పదిరెండేండ్ల వయస్సులోనేమరణించెను. వీరుఐదు నాటకములుమాత్రమే వ్రాసిరి. కాని ఆయైదును ఒకదానికన్న ఇంకొకటి ఉత్తమములు. పునహాలోని ఫర్గుసన్ కాలేజీలో ఒక సంవత్సరము చదివిన తరువాత నాటకకంపనీలోని నటుల పిల్లలకు చదువుచెప్పుటకై వీరుపాధ్యాయులుగా వచ్చిరి. వీరు మంచికవులు. హాస్యస్రష్టలు. నిమేషార్థములో పాతాళమునుండి స్వర్గలోకము వరకు సంచరింపగల ప్రతిభ వీరి సొమ్ము. గడ్కరీగారు కోల్హాట్కర్ గారి మిత్రులు.'ప్రేమసన్న్యాస్, పుణ్యప్రభావ్, ఏకచ్ ప్యాలా, భావబంధన్, రాజసన్న్యాస్'ఇవి వీరినాటకములు. వీరు తమ మొదటి నాటకముతోనే నాటక సాహిత్య శిఖరములను పాదాక్రాంతము చేసికొనిరి. 'భావబంధనము' గడ్కరీగారు కేవలము కోల్హాట్కర్ గారి కంపనీ కొఱకు వ్రాసిన నాటకము. ఇందులో కోల్హాట్కర్ ఘనశ్యామ్ అను ఖలపురుషుని పాత్ర ధరించెడి వారు. ఆ వేషమునుచూచి ఒకాయన కోల్హాట్కర్ మిక్కిలి దుష్టుడు, ఆయనను నమ్మియుండకుము అని ఒకమిత్రుని హెచ్చరించెనట.

గడ్కరీగారి ముద్రింపబడిన సాహిత్యమును గురించియేకాక వారు దినదినము తమ సంభాషణలలో వెలిబుచ్చిన అనేక విషయములనుగురించి కూడ ఈ పుస్తకములో వ్రాయబడినది. పిండప్రదానమను పేరుగల ఒకనాటకము గడ్కరీగారు వ్రాయదలంచిరి. 1762–1772 లో మాధవరావుగారు పేష్వాగా ఉండిరి. పానిపత్ యుద్ధములో ఒకలక్ష మహారాష్ట్రులు ప్రాణములు గోల్పోయిరి. విశ్వాసరావు మరణించెను. సదాశివరావు మరణించెను. ఒకసంవత్సరము గడచెను. శ్రాద్ధకర్మకై ఓంకారేశ్వరుని దేవళమునకు పోయిరి. పూనా శ్మశానవాటికవద్ద ఈ దేవాలయమున్నది. ఒకపిండము విశ్వాసరావు పేరుమీద, ఇంకొకటి సదాశివరావు పేరుమీద, వేరొక పెద్ద పిండము ఇతర మృతవీరులందరి పేరుమీద పెట్టబడెను. ఈ పిండము లన్నిటిని కాకులు ముట్టుకొనవలయును. పెద్దపిండమును కాకులు ముట్టుకొనెను. విశ్వాసరావు పిండమునుకూడ ముట్టుకొనెను. కాని సదాశివరావు పిండమును ముట్టుకొనలేదు. మధ్యాహ్నము గడచెను. మాధవరావు కుర్చున్న చోటునుంచి జరుగలేదు. నోటిలో నీటి బొట్టైన పడలేదు. దర్భలతో కాకినిచేసి దానితో ముట్టించవలయునని మలహార్ రావు హోల్కర్ సలహా నొసంగిరి. మృతునియొక్క ఇచ్ఛాపూర్తి చేయుదుమని వాగ్దానము జరిగినచో కాకము స్పృశింపవచ్చును. మాధవరావు ఇంకొక పిండము చేయించిరి. తర్పణ సమయములో తమ పేరుతో తిలాంజలి నొసంగిరి. నేటినుండి మాధవరావు మరణించినాడు. ఇక నేను సదాశివరావు కోరికలను పాలించు సాధనమును మాత్రమే అని యనిరి. వెంటనే కాకి పిండమును ముట్టుకొనెను. ఈకథ అందులోని ఇతివృత్తము.

గడ్కరీగారు 'గర్వ నిర్వాణ'మను మరొక నాటకమును వ్రాయ సంకల్పించిరి. ప్రహ్లాద హిరణ్యాకశిపుల జీవిత మిందులోని ఇతివృత్తము. ఘోరమైన తపస్సుచేసి హిరణ్యాకశిపు డమరత్వము సాధించెను. కాని తరువాత యతడు మిక్కిలి దుఃఖమును బొందెను. మృత్యు భయమువలన ఈ ప్రపంచమింత సుందరముగానున్నది. ప్రాప్యవస్తువుకొరకై చేయు ప్రయత్నములోనున్న యానందము ఆ వస్తుప్రాప్తి తరువాత నష్టమై పోవునన్న సిద్ధాంత మీ నాటకములో గడ్కరీగారు చెప్పదలంచిరి.

రామగణేశ్ గడ్కరీగారిపై కోల్హాట్కర్ గారికి మిక్కిలి భక్తి. 'తాజేవఫా' 'సుందోపసుంద్' 'పుణ్యప్రభావ్'ఆది నాటకములయొక్క నటకులకు సన్మానము జరిగెను. కాని మధుర గాయకులకు, స్త్రీపాత్రలు ధరించు సుందర యువకులకు మాత్రమే ఈ సమ్మానములు జరుగుచుండెను.

అభినయరహస్యమెరిగిన కోల్హాట్కర్‌కు సన్మానము జరుగలేదు. గడ్కరీ ప్రాణములు తల్లడిల్లెను. బొంబాయి పోలీస్ కమిషనర్ మిస్టర్ ఎడ్వర్డ్ వద్దకు గడ్కరీగారు వెళ్ళిరి. తమ చేతికున్న బంగారుగడియారము వారికిచ్చి కోల్హట్‌కర్ గారిని రంగముపైకి పిలిపించి వారికాగడియారము పారితోషికముగా నిప్పించిరి. ఈపారితోషికముతో సరితూగగల పారితోషికము తమకిదివరకెన్నడును లభింపలేదని ఇకముందు లభింపజాలదని కోల్హట్‌కర్ గారు వ్రాసిరి.

శ్రీ చింతామణ్ గణేశ్ కోల్హట్‌కర్ తమ డెబ్బదిసంవత్సరముల జీవనములో గడించిన అనుభవముయొక్క సారాంశము ఈ 'బహురూపి'లో నిక్షేపించిరి. రచయితయొక్క శైలి కేవల మతడు వాడిన శబ్దములపైననే ఆధారపడియుండదు. అనుభూతియొక్క స్వర్ణకణము తేరుకొనగలుగుచుండవలెనని కెంతేనియవసరము. పరమాత్మవిభూతి కనపడినచోటనెల్ల దానిని దర్శించగలశక్తి నేత్రమునకుండవలయును. చిన్నచిన్న విషయముల పొరలు జీల్చి వానిలోపలి రసమనుభవించి తద్వ్యాఖ్యానము చేయగలశక్తి కోల్హట్‌కర్ గారి శైలికున్నది. 'భావబంధన' అను నాటకము ఆర్థికముగా వీరికి కామధేనువువంటిది. ఈ నాటకమాడుట కొఱకు కావలసినసామగ్రి కుదుర్చుకొనుటకై వీరికి మూడు వందల రూపాయలు అవసరముండెను. కాని యవి వారివద్ద లేవు. ఘనశ్యామపాత్రధారికి ఉన్నిసూటు అవసరముండెను. పాత్రధారులు కోల్హట్‌కర్ గారే. లతికా పాత్రధారికి ఉన్ని ఓవర్ కోటు అత్యావసరమై యుండెను. అది సాంఘికనాటకము. మధ్యమ వర్గీయులపై దానిప్రభావము మిక్కిలిగా పడినది. మొదటిదినము నాటకము చూచుచున్న స్త్రీలలో నొకరు ఆ ఓవర్ కోటు లేకపోవుటలోని దోషమును గ్రహించెను. రెండవనాడామె మరల నాటకము చూచుటకు వచ్చినపుడు ఓవర్ కోటు తొడుగుకొని వచ్చెను. ప్రథమాంకము సమాప్తమగుటతోడనే ఆమె తన ఓవర్ కోటు లతికకు పారితోషికముగా నిచ్చెను. ఆ ఓవర్ కోటు అవసరము తృతీయాంకములో నుండెను.

ముప్పదిఒకటి జులై నాటిరాత్రి ఈ భావబంధన నాటకము బొంబాయిలో ప్రదర్శింపబడుచుండెను. లోకమాన్యులు 'సర్దార్ గృహము' లో మృత్యుశయ్యపై నుండిరి. రాత్రి పన్నెండున్నర గంటలకు లోకమాన్యులు తమ భౌతిక దేహమును త్యజించిరని వార్త వచ్చినది. నాటక మంతటితో ఆపబడి ప్రేక్షకులు తమతమ డబ్బు టికటులమ్ముకిటికీవద్దర తిరిగి తీసికొనవచ్చునని వెల్లడింపబడినది. తెల్లవారువరకు టిక్కటులమ్ము కిటికీ తెఱచియుంచిరి. కాని ఆవైపు వచ్చినవాడే లేడు. ప్రేక్షకులందరు దుఃఖములో మునిగి మహానాయకుని భౌతికదేహమును తుదిసారి దర్శించుకొనుట కొఱకై 'సర్దార్ గృహము' నకు పోవుచుండిరి. ఈ 'భావబంధన' నాటకమాడియే తిలక్ స్మారకనిధికై బలవంత్ నాటకమండలివారు ఐదువేల రూప్యములనిచ్చిరి.

ఈ కోల్హట్‌కర్ గారు రాష్ట్రపతిచే సమ్మానితులగుట హర్షింపవలసిన విషయము.

# ‘బి’ | యిప్పిదాటు

పూర్తిపేరు హాషిమాబీ. పనుండి హైదరాబాదు వెళ్లాను. స్నేహితుడు కుటుంబారావు ఇంట్లో దిగాను. ఆమెను అక్కడ చూశాను. పదకొండు, పన్నెండు సంవత్సరాల వయస్సుంటుంది. కుటుంబరావు అల్లా ఊళ్లోకెళ్లాడు. ఒక్కడినీ ముందు గదిలో కూర్చుని పత్రిక చూస్తున్నాను. బుట్టలోంచి పూలగుత్తితీసి నాముందు బల్లమీద పెట్టింది 'హాషిమాబీ'- ఆమెకేసి చూశాను. నవ్వింది. వాలకం, వైఖరిచూసి ముస్లింకన్య అనుకున్నాను. కోలమొహం, చామనఛాయ. కొలతబద్దతో కొలిచి అమిర్చినట్లుగా తీర్చిన పచ్చవరస- లేత పెదవుల వెనక చీకటి అడివిలో మంటలా, స్ఫుటంగా మెరుస్తుంది. అతికించి పెట్టినట్లు క్రమమైన కనుబొమ్మలు, మధ్యపాపిట ఇరుప్రక్కలా గూళ్లతెలియని నల్లపిట్టలులా, సగంసగం వొచ్చిన రెక్కలమీద ఎగిరిపడుతున్నట్లు ముంగురులు- చిన్నిగడ్డం. దాని మధ్య సున్నఆకారం పచ్చబొట్టు. చినిగిపోయిన ఎర్రగౌను- తెల్లలాగు; మెడచుట్టూ పెనవేసుగుని బాధతో విడిచి విరహంతో వొదలలేక భుజాల పట్టుగుని దేవుల్లాడుతున్న రెండుజడలు- పల్చటిగౌను, దాని కంతలలోంచి, ఎదిగి ఆకృతి తెచ్చుకుంటూన్న అపురూపమైన శరీర అవయవాల కదలిక కనబడుతూంది. నదివొడ్డున గడ్డకట్టిన మట్టిముద్ద- నీటితాకిడికి వొక స్వరూపం తెచ్చుకుంటుంది. ఆ మట్టిముద్ద మధ్యలో యుగాలక్రితం యిరుక్కుపోయిన మణిలా ఆమె శరీరంలో జీవితతృష్ణ మూలమూలల మెరుస్తోంది. పరిశుభ్రతకి అలవాటుపడని శరీరం- దుస్తులకు, జుట్టుకు దుమ్ము, మట్టి చటుక్కున ఆకర్షించేది ఆపిల్ల చూపులు. దంతపుపెట్టె తెరవగానే, లోన ంగారపు తమలపాకులా కనురెప్పల గుండా దూసుకొచ్చి వెడల్పుగా కనబడి, పక్కకి వొదిగి నిలబడ్డట్లు మొనలుతేరి, ప్రకాశించి కలవరపెట్టే చూపులు 'బీ' వి.

ఆకళ్ళ ఆకర్షణ మామూలు ఆకర్షణకాదు, అది అందంగా కూడా కనబడదు. కొన్ని జలచరాల మెదడుపైన మణులుండేవంటారు- ఆమణిలో భీభత్సంగా కనబడి గగుర్పాటు కలగజేసే వొక వికృతమైన ఆకర్షణ వుంటుంది. అల్లాంటి ఆకర్షణ ఆమెకళ్లలోవుంది. గుండ్రటికళ్లుఅంత బాగుండవు. ఆమెకళ్ళు గుండ్రంగా లేకపోయినా, నల్లపాప గుండ్రంగా కదలడంవల్ల, చూపులు అల్లా గుండ్రంగావున్నట్లు కనబడతాయేమో అనుకుంటా. నిశ్చలమైన చూపుకాదది. కంటిలో పాప గుండ్రంగా, గిరగిర తిరుగుతూవుంటుంది. మనకేసి చూడదు, మనచుట్టూచూస్తుంది. అల్లా చూస్తూ నవ్వుతూ నిలబడింది. లోపలనుండి పనికుర్రాడు. మరెవ్వొచ్చి బల్లమీద పూలగుత్తిని తీసుకువెళ్లాడు. బీ గది అవతలకినడిచి, తలుపు వెనక నిలబడి, మొహం మాత్రం కనబడేటట్లు వొంగి నాకేసి చూస్తూ నవ్వుతూ నిలబడింది. లోపలికి రమ్మన్నాను.

రానన్నట్లు తలవూపి నవ్వింది.

"నీపేరేమిటి ?"

"బీ"

"ఇట్లారా....?"

వొచ్చిందీ. కళ్లు నాచుట్టూ చూస్తున్నాయి.

"ఇదిగో... మరి నువ్వు పూపెట్టుగోవా ?"

"ఊహూ" అన్నట్లు తల ఊపింది. జడలు భుజాలమీద కదులుతున్నాయి.

"ఏంపని చేస్తావు ?"

నవ్వింది. మాట్లాడదు. నా పక్కనే బల్లమీద ఫాన్‌కేసి చూస్తోంది.

"తెలుగు మాట్లాడతావా ?"

మాట్లాడతాను అన్నట్లు తల ముందుకు వూపింది.

మూగ పిల్లేమో అనుకున్నాను. ఫాన్‌కేసి వొకటి రెండడుగులేసింది. ఫాన్‌ముందు చెయ్యి జాచింది.

"ఇంద—ఏమన్నా కొనుక్కో" అని జేబులోంచి వొక అణా తీసిచ్చాను.

పుచ్చుగోనన్నట్లు తలవూపింది.

పరవాలేదులే."

తీసుగుంది. ఫాన్‌కేసిచూసి నవ్వుతోంది,

ఫాన్ రెక్కలతోపాటు ఆమెకళ్ళు గిరగిర తిరుగుతున్నాయి.

"గాలి వేస్తోందా ?"

ఊ అన్నట్లు తలపంకించింది.

"ఇప్పుడు?" అని ఫాన్ నిలిపివేశాను.

నవ్వింది బీ. ఫాన్ తిరగడం బీకి వొక వింత. బీదపిల్ల అట్లాంటిది ఎప్పుడూ చూసివుండదు.

"మళ్ళా తిప్పండి" అన్నది బీ.

అమ్మయ్య మాటలొచ్చు. మూగదికాదు. ఫాన్ తిప్పాను. ఆమె కళ్ళు ఆ ఫాన్ రెక్కలతోపాటు గిరిగిర తిరుగుతున్నాయి. కాసేపు తిరగనిచ్చి, ఆమె స్విచ్‌ని కదిపి ఫాన్ నిలిపివేసింది. అదంతా ఆమెకి వినోదంగావుంది. ఫాన్ అల్లా కదిపితే పాడైపోతుంది. వొద్దు అందామనిపించింది. స్వంత ఫానవుతే అట్లా అప్రయత్నంగా అని వుందునేమో.

మళ్ళా స్విచ్‌ని కదిపి ఫాన్ తిప్పింది బీ. నాకు నవ్వొచ్చింది. కుటుంబరావు ఇంట్లో రేడియో పెట్టు, గోడమీద ఎత్తుగా బల్లమీద పెట్టాడు, కిందగావుంటే పిల్లలు దాన్ని కదిపి పాడుచేస్తారని భయంట.

ఈ ఫాన్‌కి జైలుకడ్డీలు లేవు. వొకరకం చట్రం వుంది; కాని దాని అల్లిక దగ్గరగా లేదు. చెయ్యిపట్టే సందులుగల చట్రం అది. నాకోసం ఆ ఫాన్ తీయించిపెట్టినందుకు నవ్వొచ్చింది. పిల్లలు స్కూలుకెళ్ళారు. 'అమ్మో' అని కేక వినబడింది. పక్కకి తిరిగి చూశాను. ఉంగరం వేలుని నోట్లో పెట్టుకుంది బీ. ఏంజరిగిందో తెలిసింది. ఆ ఫాన్ తిరుగుతుంటే అందులో వేలు పెట్టింది. వేలుకి దెబ్బ తగిలింది. చెయ్యి తీసేసి, వేలు నోట్లో పెట్టుగుంది.

"దెబ్బ తగిలిందా?"

వేలు పైకి తీసి చూపించింది. రక్తం లేదు. మంటపెట్టే దెబ్బ తగిలివుండొచ్చు. లోపలినుంచి పనికుర్రాడొచ్చి ఆమెను కసిరాడు. మళ్లా ముట్టుగుంటే చేతులు విరగ్గొడతా నన్నాడు. అవతలకి పొమ్మన్నాడు. బీ నాకేసి జాలిగా చూసింది. నేనేం చెయ్యను?

"అందులో వేళ్లు పెడితే దెబ్బ తగులుతుంది. అల్లా చెయ్యకేం" అన్నాను.

సరేనన్నట్లు తలవూపి, నవ్వింది. పనికుర్రాడు ఆమెను దూరంగా నెట్టి, తలుపు వేశాడు. ఆ వీధిలో మాంసంకొట్టు సాయబు పిల్లట బీ. వాళ్ళమ్మ మిషను కుడుతుంది. ఆ వీధిలో వున్న యిళ్లల్లోకి వెడుతూ, యజమానులు చెప్పిన చిల్లరపన్లు చేసిపెడుతూవుంటుందిట. పూలు, పాలు, పేపర్లు, రిక్షాలు— యిట్లాంటివి తెచ్చిపెట్టడం, ఎవరికి తోచింది వారు ఇస్తోంటారుట. పిల్లలతో ఆడుకుంటూవుంటుందిట. గదుల్లో కొచ్చి ఫాన్‌లో చేతులుపెడుతూవుంటుందిట.

పిల్లలందరికీ ఫాన్‌లో వేళ్ళుపెట్టడం మామూలే. పిల్లలకి కదలికంటే చాలా ఇష్టం. ఫాన్ నిలిపి, మళ్లా కదిలేటట్లు చెయ్యడంలో వారి శక్తి ప్రకటితమవుతుంది. ఆ ప్రకటనలో వారికానందం వుంది. నేను మరొకటి గమనించాను.

మగపిల్లలకి కదిలే ఆటవొస్తువులంటే యిష్టం; ఆడపిల్లలకి కదలని బొమ్మలంటే ఎక్కువ యిష్టం. ఈ సూత్రాన్ని గుర్తుంచుకునే నేటి ఆటవొస్తువులు తయారవుతున్నాయనుకొంటా. అందుకనే గిరగిర తిరుగుతున్న ఫాన్‌లో చెయ్యి పెట్టి నిలిపివేసిందేమో బీ అనిపిస్తుంది.

ఆ మర్నాడు మరొక చిత్రమైన దృశ్యం చూశాను. కిటికీలోంచి రోడ్డుమీద నడిచే జనంకేసి చూస్తూ కూర్చున్నాను. చెట్టుపక్కన చిన్న మాంసం దుకాణంముందు, ఎవరిదో బైసికులొకటి స్టాండ్‌మీద నిలబెట్టబడివుంది. హాషిమాబీ అటుకేసి వెడుతూ ఆ సైకిల్‌ముందు చూస్తూ నిలబడివుంది. పెడల్ తిప్పి, వెనకచక్రం కదిపింది. పెడల్ వేగంగా తిప్పింది చక్రం మరింత వేగంగా తిరుగుతోంది. బీ తన చేతిని ఆ చక్రం కడ్డీలమధ్య పోనిచ్చి, నిలపబోయింది. దెబ్బ తగిలినట్లుంది. చటుక్కున చెయ్యి తీసివేసి వేలుని నోట్లో పెట్టుకుంది.

తనకేసి ఎవరేనా చూశారేమో అన్నట్లు నలుదిక్కులా చూసింది. నే కూర్చున్న కిటికీవేపుకూడా చూసింది. నవ్వింది. పరుగెత్తుకు పోయింది.

నాకూ నవ్వొచ్చింది. ఆ అమ్మాయికీ నాకూ ఏలాంటి సంబంధమూ లేదు; వుండదు. అయినా ఎందుకో మాయిద్దరి మధ్యా వొక చిత్రమైన సన్నిహితత్వం ఏర్పడినట్లైంది. తరిచిచూస్తే అది కనబడదు; కారణాలు వెదికితే దొరకవు. సముద్రంలోంచి ఆవిరిలేచి మేఘంగామారి క్షణంలో భూమ్యాకాశాలని ఏకంచేసి, కదిలి మాయమవడంలోవున్న స్థూలత్వమే ఈ ఆప్యాయతలోని అనుభవానికీ వుందనిపిస్తుంది.

ఫాన్‌లో వేళ్ళుపెట్టి నిలపాలని పిన్నలకేకాక, పెద్దలకి కూడా అనిపిస్తుంది. నాకట్లా ఏన్నోసార్లు అనిపించేది. దీనికి కారణం ఏమిటో మానసిక శాస్త్రజ్ఞులు చెప్పాలి.

తెలియనివాటిని శోధించి తెలుసుకోవాలన్న అభిలాష మానవసైజం! స్విచ్‌లో చెయ్యిపెట్టి, విద్యుత్‌ద్వారా షాక్ తింటే ఎట్లావుంటుందో! అల్లాగే ఫాన్‌లో చెయ్యిపెట్టి ఆపితే ఏం జరుగుతుందో! దెబ్బ తగులుతుంది. ఆ దెబ్బలో బాధ వూహించుకుని మనపట్ల మనకి సానుభూతికలగడం, ఆ సానుభూతితో ముడిపడే ఆదరణ, శాంతి— యీ రకం చేష్టలకి ప్రేరణ అని తోస్తుంది. నాలుగంతస్తుల మేడమీద నుండి కిందికి చూసినప్పుడు, వొక్కక్షణం, ఆగోడమీద

మంది కిందికి దూకాలనిపిస్తుంది. ఉపిరిబిగపెట్టి అంతపనీ జరిగినటు వూహించి, గోడనుంచి వొకడుగు వెనక్కివెయ్యడం జరుగుతుంది. మనల్ని మనం మానసికంగా బాధించుకోడం కిందకొస్తుంది యీ తృష్ణ. కాని చాలామందిలో, నాలోలాగే, యీ తృష్ణ ఊహలోనే వుండిపోతుందేమో! బీ విషయంలో, కార్యరూపం దాలుస్తోంది యీ బుద్ధి. నాకు చెయ్యాలనిపించికూడా చెయ్యలేకపోయిన పనినికాస్తా, ఆమె సాహసంతో చేసేసింది. అందుకనే ఆమెపట్ల ఆరకం ఆకర్షణ, అన్యోన్యం ఏర్పడిందేమో అని స్ఫురిస్తుంది. 'నువ్వు చెయ్యవుకాదూ! చూడు, నేను చెయ్యిపెట్టి ఆపుజేస్తా' అన్నట్లు, ఆపనిచేసి, చేసినట్లు నవ్వుద్వారా ప్రకటించి వెళ్ళిపోయింది బీ. ఇంతటి స్వల్పవిషయంతో మా ఇద్దరిమధ్య వొక స్నేహభావం ఏర్పడినట్లనిపించిది. ఆమె జీవితం ఆమెది- నాది, నాది. మామార్గాలు వేరు ఏదోబాధ, బాధని తీసెయ్యాలన్న బాధ, -తీసెయ్యలేనందుకు నాకు బాధ, నా బాధనిచూసి ఆమెబాధ- అంతా అగిరంగిరతిరిగే బీ కళ్లల్లో, తిరిగిపొయ్యే కళ్ళని నిలిపినట్లుగా నవ్వినప్పుడు నిశ్చలంగా మెరిసే ఆమె పళ్ళమధ్య తళుకు— శాశ్వతంగా కదిలిపోయిన మధుర క్షణం ఆ అనుభవం.

కుటుంబరావింట్లో గడిపిన ఆ రెండుమూడు రోజులూ, లోలోన యిట్లాంటి ఆలోచనలు సాగించినట్లు గుర్తు. పని కాగానే వెళ్ళిపొయ్యాను. 'బీ' విషయం మరిచిపొయ్యాను కూడా.

నాలుగేళ్ల తర్వాత మళ్లా హైదరాబాదురావడం జరిగింది. కుటుంబరావింట్లో శుభకార్యం. నాకు వేరేపనికూడా వుంది. బీ కనబట్టంలేదేం ? అని అడిగాను. ఏడాది క్రితం మహబూబ్ అనే వొక ముస్లిమ్ కుర్రవాడిని వివాహంచేసుకుందిట. అత్తవారింటికి వెళ్ళిందిట.

"రేపొస్తుందంటండి" అన్నాడు పనికుర్రాడు మరెన్న. వెనక బీని కసిరి గదిలోంచి పంపించి తలుపేసింది వీడే. వీడూ ఎదిగాడు కంఠం బరువైంది. క్రాప్ పెద్దగా పెంచి వెనక్కి దువ్వాడు. నుదుటిమీద పడే వెంట్రుకలని వెనక్కి తోసివెయ్యడం, వాటిని ముందుకులాగి, మళ్లా వెనక్కి తోసెయ్యడం— అది వాడికి సరదా. గోడ వెనక్కి నక్కి సిగరెట్టు పీలుస్తున్నాడు. అది నే గ్రహించినట్లు తెలుసుకుని, కాస్తంత సిగ్గుపడి, నవ్వుతాడు. వాడిని చూస్తే బీ జ్ఞాపకం వొచ్చింది.

"బీ మొగుడి కేంపనిరా ?" అని అడిగాను.

"మోటారుసైకిల్ మీద దర్‌బర్, దర్‌బర్ మజాయించడము" అని నవ్వుతున్నాడు.

"నవ్వు దేనికిరా ?"

"అదేమో ఎనకాల కూర్చుంటుందండి. ఓ—దర్‌బర్, దర్‌బర్‌మంటూ వూరంతా కజాయింపండి" అని నవ్వుతూ గోడవెనక నక్కి సిగరెట్టు దమ్ము తీస్తున్నాడు పనికుర్రాడు మరెన్న. 'మజాయింపుట', 'కజాయింపుట'—ఏవో క్రొత్త ప్రయోగాలు నా మీద పడేస్తున్నాడు యీ బాలభాషా కోవిదుడు, మరి!

నాకు నిజంగా బీని, భర్తని చూడాలనుంది. బీకి పెండ్లయిందనగానే, చిన్నప్పుడు నేచూసిన ముస్లింల పెండ్లిండ్ల తంతు దృశ్యాలు జ్ఞప్తికొచ్చాయి- మేలి ముసుగులు, గుర్రాల మీద ఊరేగింపులు, మల్లెపూలదండలు, షహనాంబ వాద్యం, ఘాటైన పరిమళాలు — గ్యాస్‌లైట్ వెలుగులో ముసుగు మధ్యలో మెరిసిన శ్వేతనవ్వులు, నోరువిప్పితే అందులో వజ్రాలని దొంగిలించుకుపోతారన్న భయంతో బిగించిన పెదవులు.

బీ భర్తకి భారతభూసేనలలో పనిట— కుటుంబరావు చెప్పాడు. కొంతకాలానికి ఆమె భర్తకి పెద్దపదవి దొరుకుతుంది. భర్తసైన్యాన్ని అటూయిటూ నడుపుతుంటే, ఆమె వాటిని సంజ్ఞలుచేసి నిలిపివేస్తుందా ? ఆ దంపతులు గుర్రాల మీద స్వారిచేస్తారా ? వెనకటి యుద్ధాలలో, గుర్రాలు, ఏనుగులు. ఇప్పుడు టాంకులు, మోటార్లు. బీ భర్తకు వొక మోటార్‌సైకిల్ వుందిట. దానిమీద అతివేగంగా ప్రయాణం చేస్తూవుంటాడట; భార్యని వెనకాల సీటుమీద కూర్చోపెట్టుగుని.

కాని మొర్నాడు, అత్తవారి వూరునుండి బీ రాలేదు— మరెన్న చెప్పాడు.

"ఎందుకో ?"

"అసలు వొకచోట వుంచేగదండీ. ఆ మోటారుసైకిలు మీద, దాన్ని ఎనక కూకోపెట్టుగుని, చర్‌పర్, చర్‌పర్, గర్‌బర్, గర్‌బర్ మంటూ లగాయించడంతోటే సరిపోతుందండి" అన్నాడు మరెన్న. మరికొన్ని కొత్తప్రయోగాలు నా నెత్తిన రుద్దుతూ. ఆమొర్నాడు నేను బైలుదేరి వొచ్చేశాను.

నేను ఇంటికొచ్చిన నెలరోజులకి కుటుంబరావు వ్రాసిన ఉత్తరంలో బీభర్త మోటార్‌సైకిలుమీద వెడుతూ ప్రమాదవశాత్తు సైకిల్‌మీదనుండి ఎగిరిపడి, గాయాలవల్ల హాస్పటల్‌లో మరణించాడన్న వార్తచూసి దిగులుపడ్డాను. వెనక సీటుమీద బీకూడా వుందిట. ఆమెకూడా పడిందిట. ఒకటి రెండు చిన్నగాయాలు తగిలాయిట, కాని పెద్దప్రమాదం జరగలేదుట.

ఏంజరిగిందో ఊహించవచ్చు. యువతులకి వేగంగా ప్రయాణంచెయ్యడం అంటే చాలా సరదా. కదలిక, పురోగమనం, వేగం— వీటిని కాంక్షిస్తుంది యవ్వనం. భర్త మోటారుసైకిల్‌మీద వెళ్ళినప్పుడల్లా తనూవస్తానని, వెనక సీటుమీద కూర్చుని, ప్రయాణం చేస్తూవుండేది. అతివేగంగా వెళుతుంది మోటారుసైకిలు. పడికి పడిపోకుండా అతని భుజాలు గట్టిగా పట్టుగుని కూర్చుని వుంటుంది తాను. శృంగారపు తృష్ణని తాళ్లగాపేని అతనిమెడచుట్టూ బిగించి ఇంక మోటారుసైకిల్ నిలపమంటుంది. అతను వినిపించుకోడు; ఆశృంగారం చక్కిలిగింతకి ఉద్రిక్తుడై మరీవేగంగా సైకిల్ వదిలివుంటాడు. ముందుచక్రం వేగంగా కదలడం ఆమె చూస్తుంది. అందులో చెయ్యిపెట్టడానికి అంపదు. అందులోనో వెనకచక్రంలోనో, కాలుపెట్టివుంటుంది- ఏమో ! మొత్తానికి నడుస్తున్న సైకిల్‌ని నిలిపేయత్నం చేసివుంటుంది.

ఆ ఉఁగిసలాటలో భర్త పట్టు సడలివుంటుంది. వేగంలో మతిపోయి, ఏ పలుపుతిరగడంలోనో యంత్రంపట్ల ఆధ్వర్యం విస్మరించి, సైకిల్ తిరగబడి, ప్రమాదానికి గురైవుంటాడు. వేగంగా వెళుతున్న ఆ మోటార్‌సైకిల్‌ని, ఉద్రేకంతో కొట్టుగుంటున్న ఆ గుండెలని, వొక్కసారి అరికట్టి, శాశ్వతంగా, స్థిరంగా, తనదిగా చేసుకోవాలన్న యత్నం అల్లా అంతమొందిందనుకుంటేనే నాకు తృప్తి. మృత్యువుకి కారణాలు ఏమిటో వేదాంతులు చెప్పొచ్చు. మరో కొత్త కారణం కల్పించింది. 'హోషియా మహబూబా బీ' ! అర్థరహితమైన జీవితానికి అర్థం కల్పించడం తప్ప, మానవుడు చెయ్యగలిగిన మహత్కార్యం ఏముంటుంది ?

పెండ్లికూతురుగా 'బీ' ని ఊహించుకున్నాను. తెల్లటి పైజామా— ఆకుపచ్చరంగు పొడుగాటి జుబ్బా— నారింజరంగు కండువా మేలిముసుగులా తలమీదనుండి భుజాలపైకి రెండంచులూ జారేటట్లు ఆ పల్చని కండువా మడతలలోంచి ఆకుపచ్చ జుబ్బా—వక్షంమీద వ్రేలాడవేసిన రెండుజడలు, —ఏ అపయవంకేసి చూడనీకుండా, గిరగిర తిరిగే కంటిలో పాప, నిలిచి చూడమని శాసించే పల్లతలుకు, శాశ్వతంగా నవ్వే శిలాప్రతిమలా విడిన పెదవులతో నిర్మాణమైన విడని మొగ్గలాంటి ఆ చిన్నినోరు, దోప వెదుకుతూ, గుండ్రటి అవరణ చేసుకుంటూ, బెదిరి వెనక్కివెళ్ళి, తెగించి ముందుకొచ్చి, వొకరికొకరు తోడన్నట్లు వక్షంపై తేరుకుని శిఖరాలని అందుకుంటున్న చిన్ని గుండ్రటి స్తనాలు— రక్తమాంసాల పిల్ల పర్వతద్వయం నడుమ లోయలో కదలని నదిలా సన్నటి నడుం— హోషిమాబీని పెండ్లికూతురుగా అల్లా ఊహించుగున్నా. మరిప్పుడో వైధవ్యంలో బీ. అడివంతా వొక్కసారి మండినట్లు, యవ్వనపు శృంగారం వొక్కసారి ప్రజ్వరిల్లి, భూకంపంలా భర్త కోర్కెని చీల్చి, కిందికి పడేసి ఆశక్తితో అతన్ని చంపేసి, మండి మిగిలిన అడవిలో వొంటివృక్షంలా, ఎడారిలో మతిపోయి మిగిలిపోయిన చెట్టువేరులా, చంద్రబింబాన్ని కామించి గెంతి మరి కిందికి దిగిరాని సముద్రం కెరటంపై తుంపరలా— ఎక్కడో హిమాలయ పంచుశిఖరాన ఇరుక్కుపోయిన తెల్ల మేఘంలా 'బీ' నా ఊహలో నిల్చిపోయింది. పెండ్లికూతురుగా, తనూభర్తా నన్ను చూడ్డానికొచ్చి పలాం చేసినప్పుడు, ఏవేనా కానుక ఇద్దామనుకున్నాను. వైధవ్యంలో ఆమెను తల్చుకుంటే అల్లా చూడకపోవడమే మంచిదనిపిస్తోంది. నాకెందుకిబాధ !

భర్త చనిపోయిం తర్వాత బీని కుటుంబరావు చూశాడుట- నేను మరోసారి హైదరాబాదు వెళ్ళినప్పుడు చెప్పాడు, వాళ్ళ పాతింట్లో కిటికీ వెనక నిలబడి, సంధ్యకేసి చూస్తూవుందిట. నల్లజుబ్బా. అక్కడ చిరిగిన తెల్లకండువా ముసుగులా జడమీద కప్పివేసి నిలబడిందట. అతన్ని చూడగానే గుర్తించినట్లు, వోపిగలేని మందహాసంలో, పళ్ళతళుకు, పెదవుల వెనక వికసించని పుష్పంలో పుప్పొడిలాగ ముక్కలై పోయిందిట. "నువ్వు చెప్పింది నిజమే. కంటిపాప గుండ్రంగా తిరుగుతున్నట్లు కనబడుతుంది." అన్నాడు కుటుంబరావు.

అదృశ్యం కూడా నే చూడకుండాచేసిన విధికి లోలోన కృతజ్ఞత చెప్పుకున్నాను. విధిని వెక్కిరించనివారూ, తిట్టనివారూ లేరు. నాకు విధిపట్ల గురిలేదు. కాని యీవొక్కసారి దాని వునికిని గుర్తించి, జోహారు చెప్పుకున్నాను.

కుటుంబరావుకి అక్కడనుండి మరోఊరు బదిలీ అయింది. వెడుతూ నాపని ముగిసేవరకూ తనింట్లోనే వుండవల్సిందిగా ఏర్పాట్లన్నీచేసి, పనికుర్రాడు మరెన్నని వప్పగించి వెళ్ళాడు. ముందుగదిలో ఫాన్ లేదు. వీధులో వెనకవున్న మాంసం దుకాణం, చెట్టు, లేవు, ఇప్పుడక్కడ వొక టీ దుకాణం అవతరించింది. రాత్రి పగలూ, గ్రామఫోను పాటలు లవుడ్ స్పీకరులోంచి బిగ్గరగా వినిపిస్తుంటాయి, ఆలోచన తోచనివ్వని ధ్వనులు. ఒకటి రెండు రోజుల్లోనే దానికి అలవాటు పడిపోయ్యాను. ఆ దుకాణం రోతగా తోచినా, ఎందుకో అది దగ్గరలో వుందనుకుంటే కాస్తంత ధైర్యంగా, ఆహ్లాదంగా కూడా వుండేది. అయిష్టత పురిగొల్పే వాటితోకూడా సమాధానపడి, వాటిని తనవిగా చేసుకుంటాడు కాబోలు మానవుడు.

టీదుకాణంముందు, సైకిలాగింది; వొక మోటారుసైకిలాగింది. ఇద్దరుముగ్గురు పిల్లలుచేరి వాటిని పరీక్షగా చూస్తున్నారు. బీ జ్ఞాపకం వొచ్చింది. ఆయంత్రాలతో చెలగాటం అడి వినోదించేవారు లేరుకదా. బీ ఇప్పుడు ఎవరిళ్ళకి వెళ్లడం

లేదని చెప్పాడు, కుటుంబరావు. నాకామెని చూడాలనివుంది ఎందుకో ! చూస్తే బాధగావుంటుంది నిజమే. బాధపడటంలో కూడా కాస్తంత ఆనందం పొందాలనిపిస్తుంది. త్రాచుపాము పడగపైగుర్తు, సముద్రం లోతులో మత్స్యపుచిప్పలో ముత్యం, పౌరాణికయుగంలోని జలచరం నుదిటిమీద వజ్రం, జుగుప్స కలిగిస్తాయి, ఆకర్షిస్తాయి. పాముని పెంచింది క్లియోపాత్ర. ముళ్ళపొదపీడలో వెన్నువాల్చింది ఈజిప్టురాణి నేఫెర్ టిటి. కత్తిని తనరక్తంలో ముంచి జాబువ్రాసింది యూన్సి. ఈనా దిని 'బీ' కి సాధ్యంకావు. ఆమె చరిత్రకట్టల వెనక శ్రీ. జమునావొడ్డున పాడుపడిపోయిన మహల్‌లో మూల గదిలో గులాబిపూలమధ్య మొహందాచుగుని, ఎర్రటి సంధ్యాలావణ్యంచూసి ఎర్రటిపెదవి కొరుక్కుని, కారిన రక్తంచుక్కలని రాని ప్రియుడికోసం, తన గుండెవలె, ఆ చుక్కలు గడ్డకడుతుంటే చూసి విషాదంలో జారిన కన్నీటి బొట్లద్వారా, గడ్డకట్టనీకుండా, కామంతో శోకిస్తున్న చారిత్రిక జనానాలోంచి విముక్తఅయిన ముస్లింకన్య బీ. శాసించేటందుకు రాకొమారులులేరు యీనాడు; జయించేటందుకు రాజ్యాలులేవు; ఎక్కేటందుకు పల్లకీలులేవు. భగ్నంచేసేటందుకు ప్రేమించే హృదయాలు గుర్రాలమీద స్వారీచేస్తూ రావు. అదొరికిన వొక్కదాన్ని, ఆయంత్రంలో పడేసి చంపేసింది.

టీదుకాణంలోంచి తిన్నగా నాగదికొచ్చారు కొత్తగా పరిచయంఅయిన, రాజన్నగారు.

"పాపం బీ ఎల్లావుందో, చూశారా ?"

"అమధ్యచూశాను- రెండునెలలైందేమో"

"దానికేం సిక్షేపంలావుంది" అన్నాడు.

"అంటె ?"

"మాయింటికొచ్చింది చూడ్డానికి."

"దిగులుగావుందా ?"

"దిగులేం తెగులు. ఆటీన్ రాణిలాగుంది. పైగా మా గోడగడియారం తగలేసింది."

"అంటె ?"

"మాదో పాతది, గోడగడియారం వుందిలెండి. మావాడుకి ఇచ్చి, అద్దంతలుపు వెయ్యడం మరిచినట్లున్నాడు. బీవెళ్ళి అందులో చెయ్యెట్టి, పొడుగాటి తీగకివుంటుందే పెండ్యులమ్ బిళ్ళని కదిపినట్లుంది. ఏంచేసిందో వేచూడలేదు. మొత్తానికి అగడియారంకాస్తా మూలపడింది" అన్నాడు రాజన్న.

నాకు నవ్వొచ్చింది— ఆపుగున్నాను. పాడైంది మన గడియారం కాదుగా—నవ్వితే ఆయనకి కోపం రావొచ్చు.

"అన్నీ అట్లాంటి పన్లే. ప్రతిదాంట్లో వేళ్ళుపెట్టడం, చెడగొట్టడం, వేళ్ళు విరగకొట్టుకోడం" అన్నాడాయన.

"మరంతే,—ఆ పిల్ల జీవితం ? భవిష్యత్తు మాటేమిటి?" అన్నాను.

"ఏమో, ఎవడికి తెలుసు. వాళ్ళమ్మ మిషను కుడుతుంది. ఇదికూడా ఆ పని నేర్చుకుని, గడుపుగుంటుంది— ఏదో ఉపాధి దొరక్కపోదుగా" అని వెళ్ళాడు రాజన్న.

తరవాత, పనికుర్రాడు మరెన్న నడిగాను బీని గురించి. మరెన్న తన చెయ్యి బోర్ల తిప్పి చూపించాడు.

"చూడండి" అన్నాడు.

"ఏముంది ? ఏమీ కనబడ్డంలేదే !" అన్నాను.

"ఇప్పుడంతా మాసిపోయిందిలెండి-అబ్బో,—వెనక— నాలుగైదేళ్ళయిందండి—దొడ్లో ఆ వరండా ముంగల మెట్లున్నాయి చూశారు— అడ కూర్చుని ఫినైలుతో నేల తుడుస్తుండానండి. గుడ్డపీలిక ముంచి చదునకు తుడుస్తుండా, అత కొచ్చింది బీ — నా చేతికేసి చూస్తూ నిలబడింది. 'లెగు, పో, అవతలకి' అన్నానండి. గిరగిర తుడుస్తుంటే, నా చేతిమీదకి గెంతి, కాలుతో తొక్కిందండి. 'అమ్మో చచ్చా' అన్నానండి. ఫినైల్ గొట్టం బుడ్డి పైకెత్తి, నెత్తిన పెడదామని తరుముకెళ్ళానండి. షర్‌కిర్, బర్‌కిర్‌మంటా, ఓ దౌడు తీసిందండి" అని ప్రత్యేకమైనవాడిభాషలో కొన్ని అమూల్యమైన ధ్వనులతో మేళవించి వర్ణన చేశాడు మరెన్న.

"భర్త పోయింతర్వాత, ఆమెను చూశావా ?"

"లేదండి. మొగుడు చస్తే బైటకి రారండి వాళ్ళు—"

"మరి రాజన్నగారింటి కెళ్లిందిట."

"కూరకో, పచ్చడికో అళ్ళమ్మ పంపివుంటుందండి."

"ఇప్పుడు వూళ్లో లేదా ?"

"లేదండి"

"ఏమైందో"

"హాయిగా మరో సాయబుని పెండ్లిచేసుకుందండి."

"అదెప్పుడు ?"

"రెండునెల్లయిందంటండి. అదుగో మిషనుకుట్టు మస్తాన్ చెప్పాడండి."

"నిజంగా !" అన్నాను ఆశ్చర్యం ప్రకటిస్తూ.

"అవునండి. మలబార్ సాయిబంట. హఫీజంటండి ఆడి పేరు. ఇమానం నడుపుతాడంటండి. అణ్ణి చేసుకుంది."

"వారి పెళ్ళి నువ్వు చూడలేదా ?"

"పై ఊళ్ళో స్నేహం కలిసిందంటండి. కసిబిసిగా, బిగిబిగిగా, గప్‌చిప్‌గా చేసేసుకుందంటండి-ఇమానంలో తర్‌మర్

వర్ మర్ గా తిరగొచ్చునని." అంటూ పనిమీద వెళ్ళాడు మరెన్న.

నాకు నవ్వొచ్చింది—బీ మళ్ళా పెండ్లిచేసుకుందన్నవార్త వినగానే. ఏదో కొంతభారం తగ్గినట్లనిపించింది. కన్య జీవితం మాతృత్వంలోగాని సంపూర్ణమవదు. అందుకనే. కథల లోనూ, నవలల్లోనూ, విడివిడిగావున్న నాయికా నాయికలను జోడీలుగా కేటాయించ వల్సిందిగా రచయితని శాసిస్తాడు పాఠకుడు. వివాహంలో వారికథ సమాప్తం కావాలి. తర వాత వాళ్ళు ఎట్లావున్నదీ, ఏం చేసిందీ. అతను ఊహించుకో గలడు. తర్వాత ఏముంటుంది? వారికి సంతానం కలుగు తారు. పెంచి, పెద్దలని చేసింతర్వాత, తలిదండ్రులు జీవితం చాలించుకుంటారు.

యుక్తవయస్సులో ఎవరేనా పెండ్లికానివారున్నారంటే, వారిపట్ల సమాజానికి బాధ్యత వుండితీరుతుంది. వారినో ఇంటి వారినిగా చేసేవరకూ సమాజం నిద్రపోదు. నాలోవున్నది యీరకం తృప్తికాదు. వివాహం చేసుకోడంలో 'బీ' వ్యక్తిత్వం బైట పెట్టింది. ఆమె చాలా బీదది. నేను ఎదిగిం తర్వాత చూడకపోయినా, పెద్ద చక్కంది కాదనే అను కుంటాను. రోడ్డు ముగిసింతర్వాత ఊరవతల వానకి తడిసిన మన్నుగుట్టలు 'బీ' లాంటి స్త్రీలు. తోచక చేతులో వోముద్దని తీసుకుని కాలక్షేపానికి దాన్ని కదిపి, దువ్వి, నొక్కి, వొక ఆకృతి తెస్తాడు అటు నడిచిన పురుషుడు. ఎండకి గట్టిపడి ఆరూపం ప్రతిమగా నిలిచిపోతే వూళ్ళోకి తీసికెళ్ళి వొక చూరుకింద పెడతాడు. బొమ్మ పగిలి విడుతుంది. అందు లోంచి మరో బొమ్మ బైటపడొచ్చు. ఏమీ లేకపోవచ్చు। ఈసారి నాకు 'బీ' ని చూడాలనివుంది. కాని వాళ్ళు హైదరా బాద్లో లేరు. భర్తకి ఔరంగాబాద్ విమానాశ్రయంలో పనిట. అక్కడికి వెళ్లారు. ఆమె తల్లికూడా అక్కడికే వెళ్ళిందిట.

నేనూ మా ఊరువెళ్ళిపొయ్యాను. 'బీ' కి పెండ్లికాగానే ఆమెపట్ల కుతూహలంకూడా సన్నగిలింది. ఆమెనిగూర్చి ఆలోచించడంకూడా జరగడంలేదు- ఎప్పుడేనా ఆకాశంలో విమానంపెరుతూ చేసేచప్పుడుకి పైకిచూసినప్పుడు తప్ప.

రెండుమూడు నెలలకిగాని మళ్లా హైదరాబాదువెళ్లే అవ కాశం కలగలేదు. బదిలీఅయిన కొత్తఊరు కుటుంబరావుకి సరిపడలేదు. అతని ఆరోగ్యం బాగుండలేదు. మళ్లా తనని హైదరాబాదు బదిలీచెయ్యవల్సిందిగా దరఖాస్తుపెట్టుకున్నాడు. దానికేమీ సమాధానం వొచ్చినట్లులేదు. ఆరోగ్యం కోలు కొనే నిమిత్తమై రెండునెలలు శెలవుపెట్టి హైదరాబాదు వొచ్చేశాడు. చికిత్స నిమిత్తమై హాస్పిటల్లో చేరాడు. చూడ్డానికి రమ్మంటే వెళ్లాను.

కుటుంబరావుకి విశ్రాంతి కావాలన్నారు డాక్టర్లు. విశ్రాంతి కావాలన్న డాక్టర్లంటే నాకిష్టం. ప్రపంచంలో అరిష్టాలన్నీ అందరూ విశ్రాంతిలేకుండా, పనిలో నిమగ్నులు కావడంవల్లనే సంభవిస్తాయనుకునే వాళ్ళలో నేనొకణ్ణి. ప్రతి సంవత్సరం వొక్కరోజేనా, ప్రతివ్యక్తి తనుచేసేపని నిలిపివేసి, తమా యించి, తన్ను తాను సింహావలోకనం చేసుకుని, ప్రయోజనం కోరకుండా, ప్రపంచాన్ని తిలకిస్తే సత్ చిత్ ఆనందాలు సమ కూరుతా యనుకుంటాను.

ప్రపంచం నామాట వినదు. ఈముక్కలు ఎందరెందరో చెప్పారు. ఏవొకరిద్దరు ధన్యజీవులో తప్ప, యీ బోధ ఎవ్వరూ పాటించరు. గోళాలు తిరిగిపోతున్నాయి. భూమి తిరిగిపోతూంది- ఎవ్వరూ ఆపలేరు. సమాజాలు కదిలి పోతున్నాయి. మనిషి నిత్యకర్మ అనే చక్రంలో నలిగి తిరిగిపోతున్నాడు. ఆచక్రం అతను తయారుచేసుకున్నదే. 'బీ' లాంటి వారెవరేనా ఆపుదామని చెయ్యిపెడితే, ముక్క వూడి పడుతుంది. మధ్య నాకెందుకు ?

కుటుంబరావున్న వార్డుపక్కగదిలో మిషనుకుట్టు మస్తాన్ వున్నట్లు, మరెన్నవల్ల తెలిసింది. చూడ్డానికివెళ్లాను. ఏమిటో మిషనుకుట్టేవాళ్ళు సన్నగావుంటారని నాఊహ. అతనిపేరు మస్తానైనా, మిషనుకుట్టు మస్తాననే అనబుద్ధేస్తుంది ఎందుకో. సన్నగా వున్నాడు. చిరుగుల జుబ్బా- టోపీ. లోతుకు పోయిన కళ్ళు, ఎదిగినగడ్డం, మధ్య వొక పన్ను లేదు. మూతికి ఇరుప్రక్కలా కాపలా కాస్తున్నట్లు, లోతైన గీతలు. నీరసంగా కిందికిచూస్తూ, నవ్వుతూ మాట్లాడతాడు:

అతనికి కీళ్ళజబ్బుట— ముఖ్యంగా మోకాళ్ళు పట్టేస్తా యిట. మోకాలు చిప్పలపై ఏవో రబ్బరుగొట్టాలు తగిలిం చారు. ఇప్పుడు కొంచం మెరుగేట— నడవగలుగుతున్నా డుట. ఇంక నాలుగైదు రోజుల్లో ఇంటికి వెళ్ళిపోతాడుట.

"ఊరికే రాత్రి పగలు, మిషను కుట్టడం వల్ల కాళ్ళు పట్టేశా యేమో—పోనీ కొంతకాలం చేతిమిషను వాడరాదూ?" అని వోదారుస్తూ మాట్లాడాను. మరెన్న నవ్వుతున్నాడు.

"ఈదొక్కడేనంటండీ, కస్పిస్, కస్పిస్ మని మిషను తొక్కడం— బోలెడంత మంది చేరంటండీ— అక్కందరూ కాళ్ళుపట్టే వస్తున్నారంటండీ— ఈడి కర్మ."

నిజమేనన్నట్లు మస్తాన్ నవ్వుతూ తన కాళ్ళకేసి చూసు కుంటున్నాడు.

చేతులతో కాళ్లమీద రబ్బరుగొట్టాలు సరిగ్గా సర్దుతున్నాడు. ఎడమచెయ్యి వెనకభాగాన మానిపోయిన దెబ్బ గుర్తు కన

బడింది. ఆ దెబ్బకేసి చూశాడు మస్తాన్. నవ్వాడు. ఏమి టన్నట్లు చూశాను.

"ఇది ఔరంగాబాద్‌లో జరిగిందండి. ఆ మధ్య అక్కడ మిలటిరీవోళ్ల మిషన్లు వేలం పాడుతున్నారు. చవకగా కొను క్కొడుదువుగాని రమ్మందండి 'బీ'. సరేనని వెళ్లాను."

"ఎట్లా వుంది 'బీ' ?"

"బాగానే వున్నారండి. రేకుల గది వొకటుందండి. అందులో తనూ, హఫీజు వుంటారండి. వెనక మరో చిన్న గది. అందులో వాళ్లమ్మ, ఏదో గడించి పడేస్తాడండి. అయినా అలవాటు చొప్పున వాళ్లమ్మ మిషను కుడతా వుంటుందండి. ఆ చుట్టుపక్కల ఇళ్లవాళ్ల చిరిగిన బట్టలు అయ్యి, మరమ్మతు చేసిపెడుతూ వుంటుందండి."

"మరి బీ కి కాలక్షేపం ?" అన్నాను.

"మొగుడుతో షికార్లండి. ఆళ్ళ కో జీపుందండి. అందులో...."

అతని మాట పూర్తిచెయ్యకుండా ఆ వాక్యాన్ని అందుకు న్నాడు మరెన్న.

"తర్ బిర్, తర్ బిర్ మంటూ మొగుడితో షికార్లండి" అని నవ్వుతూ పూర్తిచేశాడు మరెన్న.

"విమానంలో వెళ్ళరా ?"

"నాకేం తెలుస్తుందండి. రెండురోజులే నే వుంట. ఓ రోజల్లా వేలం పాటతో సరిపోయిందండి. మొగుడు—హఫీజు—విమానం నడపడం నేర్పుతున్నాడండి. అందులో కొత్తవాళ్ళకి, నేర్పుతానికి ఎక్కించుకుపోతా వుంటాడటండి. ఆడోళ్ళని రానీరంటండి."

"మరి నువ్వెక్కావా ?"

"లేదండి."

"మిషను కొన్నావా ?"

"కొన్నానండి. ఆళ్ళ గదివెనక మండువాలో పెట్టి మిషను తొక్కి రైటు చూస్తున్నానండి సాయంత్రం. బీ వొచ్చి తొక్కుతుంటే ఆ చక్రంలో చెయ్యిపెట్టి వెనక్కి నెట్టిందండి. పై బెల్టువూడి, నావేళ్ల సూదికింద కుట్టడి పోయాయండి. అదండి యీ దెబ్బ" అని చేతి వెనకభాగంకేసి దిగులుగా చూస్తున్నాడు.

మా బాగా అయిందిలే" అన్నాడు మరెన్న. మస్తాన్‌కి వో పాతలాల్చీ పంపించాను.

"కుట్టమంటారాండి ?"

"లేదు నువ్వు తొడుక్కో" అన్నాను. అందరం నవ్వు కున్నాం.

ఆసాయంత్రం హోటలుకెళ్ళి కడుపారా భోజనం చేశాను. హాస్పిటల్‌లోంచి బైట పడగానే, మనం ఇంక బ్రదికి వున్నందుకు దైవానికి కృతజ్ఞత చెప్పుకుంటాం. పీక్కుపోను కోడం, తినడం, నిద్రపోడంలాంటి దినచర్య మరింత తీక్ష ణంగా, వుత్సాహంలో జరుపుతాం. సినిమాకుకూడా వెళ్ళాను. ఆసినిమా ఏమీ బాగాలేదు. కాని నేను చాలా ఆనందించాను. ఆ ఆనందం అంతా నాలోవున్నదే అని నాకు తెలుసు.

ఆ మొర్నాడు కుటుంబరావు హాస్పిటల్‌నుండి విడుద లయి, యింటికొచ్చే ఏర్పాట్లు చేస్తున్నాం.

మరెన్న ఎక్కడా అయిపులేదు. పక్కగదిలో మస్తాన్ కూడా కనబడలేదు. ఏమయ్యారు ? రాత్రి విడుదలయి ఇంటికి వెళ్ళాడా మరెన్నని తీసుగుని ? ఏమో. డాక్టర్ని అడగాలనుకున్నా, ఆయన ఇంకా రాలేదు. ఈలోగా ఏర్పాట్లు పూర్తయి యింటికొచ్చేశాం.

మరెన్న లేకపోతే ఇంట్లో పనికి కష్టంగావుంది కుటుంబ రావుకి. ఆ వీధిలో దుకాణంలోవుండే గాలిబ్ తన కూతుర్ని చిల్లర పనులకి పంపించాడు. ఆ పిల్లపేరు 'ఖైరున్నిసా' నల్లగా వుంటుంది. చెవులకు పోగులుంటాయి, కోలమొహం. బుగ్గమీద పచ్చబొట్లు. చలాకీగా వుంటుందికాని ఎక్కువ మాట్లాడదు.

బ్రెడ్ పట్టుగురమ్మని పంపించాడు కుటుంబరావు. నేను స్నానంచేసి, కిటికీముందు కూర్చుని పత్రిక చదువుకుంటు న్నాను. రోడ్డుమీద టీ దుకాణంనుండి సంగీతం గంద్ర గోళంగా వినబడుతూంది. దానికితోడు మరో సినిమాలారీ లోంచి పాటలు లవుడ్ స్పీకర్‌లో భీకరంగా పోటీచేస్తూ వాతావరణాన్ని కల్లోల పరుస్తున్నాయి. ఆ గంద్రగోళంలో నా మనస్సెందుకో ప్రశాంతంగావుంది.

ఒక్కసారి ఆ ధ్వనులు నిలిచిపొయ్యాయి. అంతా నిశ్శబ్దంగావుంది. లయ, క్రమం తప్పినట్లు నాకు చీకాకేసింది. ఆ పాటలు నిలిచిపోతే పిచెత్తినట్లయింది. టీ దుకాణంకేసి చూశాను. జనం గుమిగూడారు. నిశ్శబ్దంగా వున్నారు.

ఆ గుంపులో 'ఖైరున్నిసా' చేతిలో పొట్లం పట్టుగుని నిలబడివుంది. ఇంటివైపు పరుగెత్తుకొస్తోంది. ఏమిటో చూద్దామని నేనూ లేచి బైటికి రాబోతున్నాను, ఆపిల్ల గబగబ వొగరుస్తూ వచ్చింది.

"ఏమిటది ?"

"బీ చచిపోయిందట" అన్నది.

"నేను, కుటుంబరావు వొక్కసారి 'ఆ' అని నిలబడి పొయ్యాము.

"అదుగో మరెన్న అని రోడ్డుమీద గుంపుకేసి చూపించింది. మేం గబగబ రోడ్డుమీది కెళ్ళాం. మరెన్న వాడివెనక కుంటుకుంటూ మిషనుకుట్టు మస్తాను వొస్తున్నారు.

"ఏం జరిగింది?"

మెల్లిగా నడుచుకుంటూ వొచ్చి, వరండాలో బల్లమీద కూర్చున్నారు.

"విమానంలో పడి చచ్చిందండి–బీ" అన్నాడు. వివరాలు చెప్పమన్నాం.

"నిజం భగవంతుడికి తెలియాలండి. హఫీజు మరొకమ్మాయిని చేరతీశాడంటండి. దానికి కూడా విమానంలోపనిటండి. అందులో వెళ్ళేవాళ్ళకి టిఫిన్, టీ, అయ్యి యివ్వడంటండి. దాన్నికూడా తర్ఫీదుకోసం తిప్పనున్నారంటండి. హఫీజ్ ఆ పిల్ల నెక్కించుగుని పోతూంటం, బీకి నచ్చలేదండి. అదంతా వొట్టిది– ఆడోళ్ళని విమానం ఎక్కనివ్వరు. ఆ పిల్లతో ఆ మిసమీద షికార్లు తిరుగుతుండావు. వొల్లకాదని మందలిస్తే అడు వినడంలేదంటండి. హఫీజ్, ఆ కొత్తపిల్ల జీపులో తిరగడం–సాయంత్రాల విమానంలో ఎల్లడం చూసి 'బీ' కి బిసెక్కిందండి.

ఆ సాయంత్రం విమానం ఎగిరే చోటకి బైలుదేరాడంట హఫీజు. నేనూ వొస్తానంది 'బీ'. వల్లకాదన్నాడు. వొచ్చి తీరతానంది. హఫీజు లగెత్తుకుపొయ్యాడు. ఆదెనకాల బీ పరుగెత్తింది. అళ్ళమ్మ, పోమాకే, ఆ చచ్చినోడితో నీకేం కతుకు అంటానేవుందంట–యిది ..."

"....వో దిగదదిగదమని దేవుడు" అన్నాడు మరెన్న. అతన్ని చెప్పనీమని మరెన్నని మందలించాడు కుటుంబరావు.

"ఇంకేముందండి, విమానాల కాడ ఎవ్వరు పేరంటండి. వో విమానంలో హఫీజు ఆ నేర్చుకునే మార్వాడీ పిల్ల ఎక్కారంటండి. తలుపులేశారంట. బీ పరుగెత్తుకుంటా విమానంకాడి కెళ్ళిందండి. విమానం కదిలిందంట. నిలపమంది 'బీ'. పరుగెత్తుకుంటా, పైకి ఎగిరి గది తలుపు పట్టుకోబోయి, చెయ్యిజారి కిందపడి చచ్చింది అంటదండి ఆ మార్వాడీపిల్ల. అదేంలేదు. విమానం ముందుగా నిలబడింది, విమానం కదిలింది. అది తప్పుకోలేదు. దాన్ని గుద్దేసి సర్రున వెళ్ళింది–ఫర్లాంగువెళ్లాక నిలిపాను. దిగిచూసేతలికి ఎక్కడా మనిషి జపులేదు, అంటాడు హఫీజు. నిజం భగవంతుడికి తెలియాల. మొత్తానికి సచ్చిందండి– పసందైన పిల్ల పాపం...." అని మస్తాన్ తన మోకాలికేసి చూస్తున్నాడు.

కుటుంబరావు కళ్ళల్లో తడి చూశాను. అప్రయత్నంగా నా కళ్లు కూడా తడిశాయి. రుమాలుతో తుడుచుకున్నాను.

"హఫీజు అది సావాలనే ఇమానం పోనిచ్చాడండి. అందుకనే అణ్ణి పట్టుకున్నారు పోలీసోళ్ళు అణ్ణీ ఆ పిల్లనీ...." అన్నాడు మరెన్న.

"ఏముందండి– అదు గోల– నాకేం లేదు బాబో అని ఏడుస్తాడు. అది ఆపుచెయ్యమంటే, అదంతా వేళాకోళం అనుకున్నాడుటండి. నిజంగా చస్తుందని కల్లోకూడా అనుకోలేదన్నాడండి. ఆళ్ళిద్దరినీ అరెస్టుచేశారండి. బీ తుక్కుతుక్కుఅయి, మనిషెక్కడా కనబడలేదండి. తెల్లవార్లు లైట్లేసుగుని వెతికి, తెల్లారగట్ల, పొదల్లో దానిబట్టలపీలికలు, మిగిలినవాటినీ తెచ్చి భద్రంచేసి, గుర్తుపట్టే నిమిత్తం తెలిసిన వోళ్ళని పట్టుకురమ్మని. పోలీసోళ్ళని కారులో పంపితే, నేనూ—నడవలేను కదండి—సాయంగా, మరెన్న, రాత్రికి కాల్లో బైలుదేరి మధ్యాహ్నానికి చేరుకున్నామండి. గుర్తుపట్టామండి. అణ్ణి విడిచిపెడతారంటలెండి — పెద్ద పోలీసుదొర చెప్పాడండి. 'బీ' పోతాపోతా నన్ను విమానం ఎక్కించి మరీపోయిందండి–"అని నవ్వి మౌనంలో పడ్డాడు మస్తాన్.

"........నానూ ఇమానంలో తస్బిస్, గస్బిస్ మంటూ, జుయ్‌గుయ్, మంటూ వొచ్చేశానండి— అదుగో ఆపోలీసు దొరగారితో........" అని పూర్తిచేశాడు మరెన్న.

టీదుకాణం సంగీతాలు మళ్ళా అందుకున్నాయి. గుంపు పల్చబడి, వాళ్ళవాళ్ళ పనులమీద పోతున్నారు. నిత్యజీవితం గిరగిర తిరుగుతూ కొనసాగుతోంది. సూర్యుడు పైకిపోతున్నాడు. నాకారోజున భోజనం చెయ్యబుద్ధిపుట్టలేదు. కుటుంబరావు, నేనూ కాస్తంత బ్రెడ్ తిని, కాసిని పాలుతాగి పడున్నాం. సాయంత్రం బైటికినడిచాను. ఆకాశంలో అర్ధ చంద్రుడు తెగిన సౌందర్యంతో దిగులుగా మొహంచూపలేక మేఘంవెనక మరుగుపడ్డాడు. వీధిచివర ఇంట్లోకి పరుగెట్టింది కొత్తపనిపిల్ల కైరున్నిసా. ఇళ్ళు, రోడ్డు, చప్పుళ్ళు, మనుషులు వెనక దిగడిపొయ్యారు. అవింక రాతిగుట్టలు— అక్కడక్కడ ఎదిగేవిధం తెలీక మొలిచినచెట్లు. పైన ఆకాశం, తారకలు, దిగులు తగ్గినట్లయింది. బరువు ఎవరో తీసేశారు. సందేహాలు, శంకలు, ప్రశ్నలులేవు. నాకర్థమైంది.

విమానాశ్రయం దగ్గరకి పరుగెట్టుకుంటూ వెళ్ళింది హాషిమాబీ. విమానంలో ఎక్కి, ప్రయాణానికి సిద్ధంగా వున్నారు, హఫీజ్, శిక్షణపొందుతున్న ఆఅమ్మాయి. విమానం భూమిమీద కదలడానికి సిద్ధపడుతోంది. పైకి లేచే ముందు ఐదారొందల గజాలమేర నేలమీద చక్రాలపై

సాగి, వేగం పూరించుగుని ఆ పైన పైకిలేస్తుంది విమానం. ఆ పరుగుకి సిద్ధపడుతూంది విమానం. దానిముందు. ఫాన్‌లో రెక్కలలాంటివి పెద్దపెద్ద రెక్కలుంటాయి. అవి వేగంగా తిరుగుతాయి, తరవాత విమానం కదలుతుంది. హాషిమాబీ విమానం పక్కకి వెళ్ళి పైకి చూసింది. పైన ఎవ్వరూ కన బడరు. విమానం ముందుకొచ్చింది. బ్రహ్మాండమైన వేగంతో ఫాన్ రెక్కలు గుండ్రంగా తిరుగుతున్నాయి. నిలపమని కేకేసింది. ఆ చప్పుడులో ఎవరికీ మాట వినపడదు. విమానం కదలబోతోంది. ఆ రెక్కలని పట్టుగుని నిలిపి వెయ్యాలి. తనకి తెలిసింది. అలవాటైంది. అదొక్కటే సాధనం. చెయ్యిపెట్టి పట్టుకోబోయింది. ఆ చక్రంలో శక్తి ఆమెని గిరగిరతిప్పి, తుక్కు చేసేసి, దూరంగా ఎక్కడో గిరవాటెట్టింది. ఆమెలో మిగిలిన భాగాలు గుర్తుపట్టడమే కష్టమైపోయింది.

ఆ విధంగా నీ అంతమొందిందనుకుంటాను. మధ్యాహ్నమంతా చెప్పుకుని కుటుంబరావు, నేనూ యీ నిర్ణయాని కొచ్చాం. కొన్ని విషయాల పట్ల కారణాలు స్పష్టంగా వుండనక్కర్లేదు; తర్కబద్ధమైనవిగా నిర్ణయానికి తరమనక్కర్లేదు. కాని పర్యవసానాన్ని మనస్సు ఆమోదిస్తుంది. ఆ ఆమోదంలో గొప్ప ఆనందం వుంది.

రాయిమీద కూర్చున్నా. నక్షత్రాలు మసగమసగగా కన పడుతున్నాయి. ఎక్కడనుండో ఏజంతువు అరుపో వినబడుతోంది; ధ్వని నిశ్శబ్దాన్ని కామిస్తోన్నట్లు. పాదాలకింద కీచురాయి రోదిస్తోంది. అనిశీధి ప్రశాంతతలో నా ఊపిరికి స్థానంలేదు. నిట్టూర్పు అక్కడ వొదిలేసి వెనక్కితిరిగాను. అక్కడే వొకరాయిలా స్తంభించి నిలిచిపోతుంది ఆనిట్టూర్పు.

మృత్యువుతో కథని ముగించడం సులువే. కథలో ఇమడటానికి అనువైనవిగా సిద్ధంగా లభించవు జీవితంలో సంఘటనలు. కాని నీ కథ సిద్ధంగా అమిర్చిపెట్టిన కథ. దానికేదో అతికించి, కల్పించి, వ్యాఖ్యానించి, ముగించే అవసరం లేకపోయినా, చటుక్కున స్ఫురించే అర్థంమట్టుకు కనిపించడం లేదు. ఈకథకేమన్నా అర్థంవుందేమో ఎవరైనా చెబితే సంతోషిస్తా.

ఏదో అంతరార్థం కల్పిస్తేగాని, మనస్సు కుదుటబడదు. ఈప్రాణి ఏ కొత్తవిషయం సాధిస్తుందో చూద్దామన్నట్లుగా వొక్కొక్క జీవుడిని లోకంలోకి నెట్టుతుంది సృష్టి. తన ఉనికిని పెంపొందించుకోవాలనే సృష్టి అభిలాష. దానికి తోడ్పడేటందుకు ప్రాణులను సృష్టిస్తుంది. ఒక్కొక్క ప్రాణీ వొక్కొక్క సృష్టి రహస్య పరిశోధకుడు. వారివారి కృషి ఫలించిందీ, లేనిదీ, సృష్టికే తెలుస్తుంది. పెడతోవని వెళ్ళిన వారినీ, మిడిసిపడి, అతిగా శోధించినవారినీ, సృష్టి మందలిస్తూనే వుంటుంది. తన శక్తికి మించిన శక్తిగల ప్రాణులొచ్చిపడితే భరించలేదు.

అట్లాంటి ప్రాణి, హాషిమాబీ. గుండ్రంగా తిరిగే కంటిపాపల నేత్రాలుగల శారీరక వైచిత్రిని తెచ్చుకుని సృష్టి రహస్యాన్ని శోధించడానికి పూనుకుంది ఆమె. ఆపరిశోధన స్వరూపం ఎట్లాంటిదో నే ఊహించగలను.

మొత్తం విశ్వంలోవున్న పదార్థం అంతా వొక చిన్న గోళంగా కుదించి వుండేది. సృష్టి ప్రారంభంలో అది ఎందుకు అల్లావుందో, ఎక్కడినుంచి వొచ్చిందో ఎవ్వరికీ తెలియదు. ఉంది. అంతే. ఆదిలో దాన్నెవరో గిర్రున తిప్పారు. అది కోట్లసంవత్సరాలుగా గిరగిర తిరుగుతోంది. తిరగడంలో గోళంలోపల పదార్థం అణువులు వొత్తిడికి దీకొని, విడి, వేరువేరు గోళాలుగా తిరుగాడాయి. అట్లా ఒక్కొక్క గోళంలోనుంచి కొన్ని పిల్లగోళాలు వుద్భవించి, పరిభ్రమిస్తూ వున్నాయి. విడిపోయినా, వాటికి అన్యోన్య ఆకర్షణవుంది. నిర్ణీతమైన దూరంలో మార్గంలో తిరుగాడుతాయి. గోళాలు పెరిగిపోతున్నాయి. కొన్ని విడిపోయి, నుసైపోతున్నాయి. కొన్ని పెద్దవైపోతున్నాయి. విశ్వం పెరిగిపోతూవుంది. విశ్వంలో ప్రతి పదార్థమూ గిరగిర తిరిగిపోతూంది. దాన్ని ఎవ్వరూ ఆపలేరు. మొదట్లో ఏశక్తి తిప్పిందో, ఆశక్తికి కూడా నిలపడం సాధ్యంగాదు. సృష్టి ఆగదు. పరిభ్రమిస్తూ వుంటుంది. విశ్వంయొక్క వైశాల్యం గాంభీర్యంతో పోలిస్తే మానవుడు అల్పుడు. కాని దాని వైశాల్యం, గాంభీర్యం ఎట్టివో ఎంతటివో తెలుసుకోగల మహత్తర శక్తి, అద్భుత చైతన్యం, వొక్క మానవుడికే వున్నాయి. విశ్వంముందు మానవుడి అల్పత్వం ఋజువు కావాలంటే, అది మానవుడి ఊహవల్లే జరగాలి

కాని, ఇది తెలుసుకోడంవేరు. ప్రత్యక్ష పరిశోధనకి పూనుకుని, ఊహని కార్యంలోకి మార్చడంవేరు. ఆ కదిలి పొయ్యే సృష్టిని, తిరిగే విశ్వాన్ని, వొక్క క్షణం ఆపుతానంటుంది హాషిమాబీ. అంతటిశక్తి యౌవ్వనానికి తగదు. అంతటిశక్తిని ఆమె శరీరం వుంచుకో లేదు. దైవానికి సాధ్యంకాని కార్యం ఆమెకి ఎందుకు సాధ్యం కాకూడదో ఆమెకి తెలీదుపాపం. ఈరకం పరిశోధనకా ఆమె నిక్కడికి పంపించటం; తగదని తీసుకు పోయింది సృష్టి.

మళ్లా మనుషుల అలజడి, దుమ్ము, ధ్వని, దీపాలు, గుడ్డవిప్పుగుని నగ్నంగా గెంతుతూవున్న గాలి— యీ నా ఆలోచనల్ని భంగంచేశాయి. అదుగో దూరంగా రోడ్డు

మొగ. అక్కడో రాతిబండ. దానిమీద వో కుర్రాడు. పరీక్షగా చూశాను. మరెన్న.

"ఏం మరెన్నా ఇల్లా కూర్చున్నావు వొక్కడవు? అయ్య గారిక్కావల్సినవన్నీ చూశావా?"

"ఊరికేనే. ఏమీ తోచక యిట్లా గొచ్చానండి."

"ఏం?"

"దీనిగురించి తల్చుకుంటే దిగులేస్తుందండి."

"అవును పాపం."

జేబులోంచి ఏదో తీశాడు మరెన్న. కాగితం మడత. అది విప్పాడు.

"తెల్లవార్లు తెగ వెదికినారంటండి. దీ జాడ కనబడలేదండి. సాయంకాలం వొచ్చేముందు, నేనూ ఎదికినానండి-దిగమగ గమదిగ పుట్లంట నడుసుకుంటూ ఎళ్ళి. దాని బట్టల పీలికలు అయ్యి, ఆపొదంట దొరికినయ్యండి. అద ఏడుందండి-యీ తలవెంట్రుక అని కాగితం మడతలోంచి నల్లటి పొడుగాటి తలవెంట్రుక అరచేతిలో పెట్టి పైకి చూపించాడు.

"దీ జడలోదండి."

నేనేమీ మాట్లాడలేదు. ఏమనాలో తెలీదు.

"దాని జడలోదనెట్లా తెలుసు?"

"చూడండి వొంకీలేదండి. అక్కమ్మది వుంగరాలజుట్టండి- దానిదీ అదేనండి. దానికి వొంకలుతిరిగే ఉంగరాలజుట్టంటే యిష్టంలేదంటండి. జడవొంకర్లు తిరగకండా పెన్పుళ్ళు, బలపాలు నెత్తినపెట్టుగునేదండి...." అన్నాడు.

నడకసాగించాను. వాడూ లేచాడు. "అయినా మనకెందుకండి— దేనిజోలికి పోగూడదండి." అని మరెన్న ఆ వెంట్రుకని నగ్నంగా వీస్తున్న గాలిలో విడిచేశాడు. చంద్రుడికేసి ఎగిరిపోయింది. దానిలో నగ్నశరీరాన్ని మరుగుపరచుకుంది గాలి. వెనకటి కథలకి చివర గుణపాఠం తగల్చడం సంప్రదాయం. కదిలేవాటిని నిలపకూడదు అన్న నీతిపాఠంతో యీకథ ముగించబుద్ధివేస్తుంది. ఇది నే నేర్చుగున్న పాఠంకాదు. అసలు దేని జోలికి పోకూడదన్నాడు మరెన్న. గీతలో బోధఅది. ఆవొక్కవాక్యంతో మరెన్ననీ- మరొకడినీ, అందరినీ, ప్రపంచంలో ప్రాణులన్నింటినీ, వొక అణువుగా చేసేసి చేతిలోబిగించి గుండెలకు హత్తుకోవాలనిపించింది. ఆక్షణికమైన అనుభూతినిచ్చి వెళ్ళిన హాషిమాదీ, జీవిత రహస్య పరిశోధనలో కృతార్థురాలైందనుకుంటా.

## స వ ర ణ

జయంతి 8 వ సంచిక 16 వ పుటలో "శాపితాఖిల విపక్ష స్త్రైచ మహానుభావాశ్చ శాపితాఖిల విపక్ష మహానుభావాః అని ద్వంద్వము చేయవచ్చును. ఇట్లు ద్వంద్వము చేయక"— అని యున్నది. ద్వంద్వమునకు బదులు కర్మధారయము అని సవరించుకొనవలయునని ప్రార్థించుచున్నాము. —సం.

# గురజాడ - రసచర్చ

కోటగిరి విశ్వనాథరావు

గురజాడవారి "లవణరాజు కల" యందు శాంత శృంగార అద్భుతరసములు కలవని శ్రీ రమణా రెడ్డి గారు 'అభ్యుదయ' లో వ్రాసిరి. గురజాడవారి రచనలు రసప్రధానమైనవి కావని నా యభిప్రాయము. సంఘ సంస్కరణాభిప్రాయములతో బాటు వానియందు కొంత కథాచమత్కారముండిన యుండవచ్చును. అట్టి రచనలలో రసమున్నదని చెప్పుటకు ప్రయత్నించుట వ్యర్థము. గురజాడ అప్పారావుగారుకూడ తనరచనలు రసప్రధానములుగా నుండునట్లు రచించలేదు. అట్టివారి రచనలను రసవిషయికముగా చర్చించుట సరియైన విమర్శన కాదు. అందుచేతనే బహుశః శ్రీ సీతారామరావు గారు రసచర్చ చేయలేదు. శ్రీ రమణారెడ్డిగారు సెలవిచ్చినవిధముగా లవణరాజుకలయందున్న రసమునుగూర్చి చర్చించెదను.

ఒక యువకుడు ఒక కన్యను చూచెను. చూచి ఆమెను వివాహము చేసికొనవలెనను తనవాంఛను వ్యక్తీకరించెను. ఆమె మొదట ఓరమోమిడి తర్వాత సుముఖురాలైనది. ఆ తర్వాత వారిద్దరు వివాహము చేసికొనిరి. ఈ పై వాక్యములందు రసమున్నదా ? మధిర సుబ్బయ్య దీక్షితులు వ్రాసిన "కాశీమజిలీల" లో కూడ బహుచమత్కారవంతములైన కథలు కలవు. వానియందురసత్వ మున్నదని పండితు లంగీకరించెదరా ?

"విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః ఆనీయమానఃస్వాదుత్వంస్థాయీభావో రసఃస్మృతః' విభావ, అనుభావ, వ్యభిచారిభావములచే ఆస్వాద్యమానమగు స్థాయీభావము రసము. ఇట్టి రసము సాధారణీకరణముతో సహృదయున కనుభూత మగును. ఈసాధారణీకరణముచేత సహృదయుడు నాయకునితో అభేదము పొందును. "తా ఏవ పరిహృత విశేషారస హేతవః" సాధారణీకరణము చేత విగళిత వేద్యాంతరస్థితి నందుకొని సహృదయుడు బ్రహ్మానంద సహోదరమైన రసానందమును పొందును. ఇట్టి స్థితిని "లవణరాజుకల"లో మనము పొందుటలేదు. పైని చెప్పిన యువతీయువకుల విషయములోకూడ నంతే! అందుచేతనే వానికి రసత్వము పట్టలేదనుచున్నాము. అయినచో "లవణరాజుకల" యందు కొన్నిభావములు కలవు కదా?-ఉన్నవి. కాని అవి అపరిపుష్టములు. ఎక్కడ అనుభావ పౌష్కల్యముండునో అక్కడ రసముండును. ఎక్కడ అనుభావ దారిద్ర్యముండునో అక్కడ రసముండదు. "లవణరాజుకల" యందున్న భావములు కేవల భావములే : భావమనగా మనోవికారము. అందువలన 'లవణరాజుకల"కు రసత్వము పట్టించుటకు యత్నించుట వ్యర్థము.

శ్రీ రమణారెడ్డిగారు రసశాస్త్ర విషయ చర్చలోనికి దిగినారు కాబట్టి నేనును ఏతచ్ఛాస్త్రాభిముఖముగనే చర్చించుచుంటిని. వారు "లవణరాజు కల" యందు శాంత శృంగార, అద్భుతరసములు పోషింపబడినవని వ్రాసినారు. ఆమూడు రసములేవిధముగ నాభాసమైనవో సహృదయులకు నివేదించెదను. ముందు శాంత రసవిషయము చెప్పెదను. "శాంతశ్చ తృష్ణాక్షయసుఖస్య యః పరిపోష స్తల్లక్షణోరసః ప్రతీయతే ఏవ" శాంతరసమునకు తృష్ణాక్షయ సుఖమే స్థాయీభావమని ఆనందవర్ధనాచార్యులు సెలవిచ్చిరి. అనగా శమము స్థాయీభావము. అది ఉత్తమనాయకాశ్రయము. ప్రపంచ

మనిత్యమని తెలియుటచే కలిగిన వస్తునిస్సారత ఆలంబన విభావము. పుణ్యాశ్రమ, తీర్థ, రమ్యవన, పుణ్య పురుష సాంగత్యము లుద్దీపనవిభావములు. రోమాంచ, సంతోష, భూతదయాదు లనుభావములు. నిర్వేద, హర్ష, స్మృతి, మత్యాదులు వ్యభిచారి భావములు. లవణరాజు చితినిజొచ్చుట ప్రపంచ మనిత్యమని తెలియుటచే కలిగిన వస్తునిస్సారత కాదు. కరువువచ్చుటచే బాధ లనువింపజాలక చచ్చిపోయినాడు. ఆ కారణముచేత తృష్ణాక్షయ మాతనిలో జరిగినదని చెప్పుటకు వీలులేదు. కరువు రానిచో లవణుడు సాంసారిక సుఖములనుభవించు చుండెడివాడే కదా ? అందుచేత ప్రధానమైన ఆలంబన విభావమే భంజింపబడినది. ఒకడు దారిద్ర్య బాధపడలేక బాకీలుతీర్చలేక విషము మెసవి చని పోయినచో శాంతరస మనుభూతమగునా ? ఇక ఉద్దీపన విభావములైన పుణ్యాశ్రమ తీర్థ పుణ్య పురుష సాంగత్యాదులు వర్ణింపబడలేదు. పైపెచ్చు కరువువచ్చినప్పుడు పశువులను చంపితినిన వారి సాంగత్యమే నాయకునకు కలదు. రచయితయే పోట్లాటల కాలవాలమైనదిగా హరిజన వాడను వర్ణించినారు. అది పుణ్యాశ్రమము కాదుకదా! తీర్థవిషయము చెప్పబడనేలేదు. పశువులను చంపు వారిని ప్రబోధించి జీవహింస చేయరాదని చెప్పని లవణరాజులో భూతదయాదులైన యనుభావములు నాస్తి. వ్యభిచారి భావములమాట చెప్పనవసరములేదు! "కులములేదట వొక్కవేటున పసరముల హింసించువారికి" అని శాంతరసమునకు సంబంధించిన నాయకుడు చెప్పుట మహాదోషము. ఇట్లనేక రసదోషము లీకృతియందు గలవు. మరల నొకపర్యాయము మనవి చేయుచున్నాను. రసదృష్ట్యా గురజాడవారి రచనలు నిలువజాలవు. కాని యిట్లనిన శ్రీరెడ్డిగారూరుకొనరు. అందుచేత నే వ్రాయుచుంటిని.

ఇక శృంగార రసవిషయము. స్థాయిభావము రతి. ఆలంబన విభావములు నాయికా నాయకులు. ఉద్దీపన విభావములు ప్రాయము, సౌమ్యం, చేష్టలు. స్తంభ, ప్రళయ, రోమాంచాదులు, సాత్త్విక భావములు. నిర్వేద, శ్రమ, దైన్యాదులు వ్యభిచారి భావములు. పైనచెప్పిన భావసాంద్రతచేత రసము జనించును. మొదట నాయిక నాయకుని జూచి యనురక్తురాలు కావలెను. "పూర్వం నారీభవేద్రక్త పుమాన్ పశ్చా త్తదింగితైః తతస్సంభోగ లీలేతి స్వభావసుభగాస్థితిః" అని రుద్రటుడు చెప్పినాడు. లవణరాజుకలయందు లవణుడే ముందను రక్తుడైనట్లు వర్ణింపబడినది. "యించుక సంశయించక కించలన్నియుతొలగి వెంబడి వేడి యిట్లంటిన్" ఇందుచేతనాయకునికుండవలసిన స్థైర్యాదులులేవను కొనవలసినదేకద! ఇట్లుచిత్రించుటహృద్యము కాదు. నాయకుడుత్తమ కులసంజాతుడు. నాయికా లక్షణములు మాలెతయందు చిత్రింపబడలేదు. ఇది అలంకార శాస్త్రవిరుద్ధము. ప్రధానముగ నీలోపము లున్నకథలో శృంగార రసమున్నదనిచెప్పుట పొసగదు. ఉద్దీపన విభావములు సాత్త్విక భావములు, వ్యభిచారిభావములు, సుష్టుగాలేవు. అందువలన రసస్థితిపట్టదు. "తాటివనములు తూర్పుకొండను గొడుగులెత్తెను, చామరంబులునిడిపె, జీలుగులుడుగణంబులు దవ్వులనిలచెన్" "చల్లగాలులుసాగి యలలుగ జల్లుజల్లున రాల్చెను పూవు" అప్పుడు నృపతి ఆకలిసి మరిపించు గానము వినిపించుచున్న శ్యామలాంగిసిగాంచెను. "అరమొగిడ్చిన కన్నుగవతో చెదరియాడెడి ముంగురులతో, బెదురు యెరుగని బింకమొప్పిన బెడగునడకలతో కూటికడవను భుజముపైనిడుకొని, పాటలాధరి' ప్రత్యక్షమయ్యెను. అప్పుడు లవణుడు 'అధికతర మొకవింతయాకలి మనసుగ్రాచెను; యింతయంతని చెప్పనేరక వెంబడించినాడు. నాయిక యిదిచూచి కన్నులుడించి, మది తలపోసిమిన్నక తోవసాగెను. అపుడు 'రాజుభృత్యునై తిని నేను మూర్తికి, భృత్యునౌదును నీకు సుందరి!' అని ప్రాథేయపడినాడు. కన్య తననిజస్థితిని చెప్పినది. అయినను నేను నిన్ను

వివాహమాడెదనని చెప్పి వివాహము చేసికొనినాడు రాజు. తర్వాత సంతానము కలుగుట, కరువువచ్చుట చితిని ప్రవేశించుట వర్ణింపబడినవి. ఈకథ విన్నప్పుడు పాఠకుడు బ్రహ్మానందసహోదరమగు ఆనందమును పొందగలడా? అభిజ్ఞాన శాకుంతలములో శకుంతలా దుష్యంతుల శృంగారమువలన కలిగిన రసానంద మీకథవలన కలుగుచున్నదేమో సహృదయులు నిర్ణయించవలెను. శృంగారస్పర్శగల భావములు కొన్ని "లవణరాజుకల"యందు కలవు. రసత్వమువానికి సిద్ధించలేదు.

అద్భుతరసము శాంతశృంగారములకు వ్యవధానముగా జేయబడినదని శ్రీ రెడ్డిగారు వ్రాసిరి. లవణరాజుకలయందు శాంత శృంగారములకంటె అద్భుతరసమునకే ఆధిక్యము కలిగినది. కొంతవరకిదియే అంగిరసమువలె భాసించుచున్నది. ఈరసమునకు విస్మయము స్థాయిభావము. లోకోత్తరమైన వస్తువాలంబనము. ఆవస్తువుయొక్క గుణములుద్దీపనవిభావము. స్తంభ, స్వేద, రోమాంచ, గాద్గద్య, ఆవేగ నేత్రవికాసాదు లనుభావములు. వితర్క, ఉన్మాద ఔత్సుక్యాదులు వ్యభిచారి భావములు. లవణరాజు 'గండుగారడి' చేత అశ్వారూఢుడై మాలకన్నెయున్న తావునకు వెళ్ళుట, అక్కడ కొన్నివిచిత్ర సన్నివేశములకు లోనగుట మొదలైనవి యద్భుతావహము లనుకొనవచ్చును. కాని లోకోత్తరమైన వస్తువాలంబనముగాలేదు. అందుచేత అద్భుత రసముకూడ పరిపుష్టముగా నిర్వర్తింప బడలేదు. ఒక స్త్రీ శిశువును కనెననగా ఎట్లు కనినదని పరమాద్భుతము నొందవచ్చును. కాని అదిఅద్భుత రసాభాసమున కుదాహరణము. అట్లేలవణరాజు కలలో అద్భుత రసాభాసమే యున్నది. ఈ విధముగా రసత్వము పట్టని శాంత శృంగార రసములకు అద్భుత రసము వ్యవధానముగా నున్నదని చెప్పుట హేతుహేతు మద్భావయుతమైన మాటకాదు. ఈ కథను రసదృష్ట్యా విమర్శించవే కూడదు. కాని శ్రీ రమణారెడ్డిగారివలన నిట్లు శాస్త్రచర్చ చేయవలసి వచ్చినది.

అసలీకథ నిట్లు చెప్పకూడదు. లవణరాజు మాలల దుర్భర పరిస్థితి నవలోకించి దయార్ద్రహృదయుడై వారి పరిస్థితిని సరిదిద్దుటకు సమాజమందు న్యాయమైన స్థానమును వారికి కల్పించుటకు, మాలెతను వివాహము చేసికొనినట్లు చెప్పినచో నుదాత్తముగ నుండెడిది. అట్లుగాక మాలెత అందమునకు మురిసి ఆమెను వివాహము చేసికొనుటకు సమాజమును దూషించుట వలన లవణునిలోని భయంకర కాముకత్వము వెల్లడియగుచున్నది. ఇట్లు చిత్రించకుండ పై విధముగ కథను మలచినచో హృద్యముగ నుండెడిది.

ఇక మార్పుల విషయము : పెద్దన్న మూలకథను మార్చినారు కదా యని రమణారెడ్డిగారనుచున్నారు. పెద్దన్న మను చరిత్రలో శృంగార రసాభాస విషయము నింతకుపూర్వమే పండితులు చర్చించినారు. వరూధునీ ప్రవరుల విషయమున రసాభాసమే రసవంతముగా నుండినది. శాంతరస ప్రధానమైన కావ్యమునందు శృంగారరసమాభాసమగుటలో సొగసున్నది. శాంతరసమొల్కు ప్రవరుని శీలము శృంగారరసాభాసమువలన మహోదాత్తమైనది. సందర్భమును బట్టి రసాభాసము కూడ రసముగనె భాసించవచ్చునని పూర్వాలంకారికులు సెలవిచ్చిరికూడ. "విరాగియైన ప్రవరునకు బిళ్ళల మొలత్రాడు కట్టి పల్లెవాటు వేసి విటునివలె దిద్ది వరూధిని కడకు తీసికొని వెళ్ళినప్పుడు" అని శ్రీ రెడ్డిగారు వ్రాసిరి. త్వరపడి మహాకవులను గురించి యట్లనగూడదని మనవి. ప్రవరుడు మానసికముగ విరాగి. అంతేకాని సంసారమును పరిత్యజించిన సన్యాసికాదు. కర్మయోగి! అందుచేత ప్రవరుని వేషములో దోసగులేదు. "అర్ధచంద్రుని తేటనవఘళించు లలాటపట్టి..." అనుపద్యములో మాయాప్రవరుడు వర్ణింపబడినాడు. దీనినిబట్టి మొదట ప్రవరునివేష మెట్లుండెనో తెలిసికొన

గలుగుచున్నాను. చివఱ పాదములో "శాంతరస మొలుక బ్రహ్మతేజంబుతోడ" అని కవి చెప్పుచుండగా ప్రవరుడు విటుడుగా భాసించుచున్నాడు శ్రీ రమణారెడ్డిగారికి! మార్కండేయ పురాణములో నున్న కొన్ని విషయములను పెద్దన్న మార్చినాడనుచున్నారు. సత్యమే. పురాణకథ రససమంచితముగా ప్రబంధమునందు మార్పు చేయబడును. వీరేకాదు కవికులగురువు కాళిదాసు వ్యాసుని శకుంతలోపాఖ్యానములో కొన్ని మార్పులు చేసి అభిజ్ఞాన శాకుంతల మహానాటకమును వ్రాసినాడు. పూర్వకవు లెన్ని మార్పులు చేసినను వాతావరణభంజకములుగా చేయలేదు. అవి ప్రధాన రసవ్యతిరేకములు కాలేదు. అనుచిత విభావత్వము చేయబడలేదు. గురజాడ అప్పారావుగారి మార్పు ప్రధాన రసభంజకముగను, వాతావరణ భంజకముగ నున్నదని మనవి. "మలినవృత్తులు మాలవారనీ కులములేర్చిన బలియురొకదేశమున కొందరి వెలికిదోసిరి" మొదలైన వాక్యములందు ఇరువదవ శతాబ్దపు అభ్యుదయ వాతావరణము స్పష్టముగ వ్యక్తమగుచున్నది. పురాణకాలపు లవణరాజు కథయం దీవిధమైన వాతావరణము వ్యక్తీకరింపబడకూడదు. అట్లు చేయుట దోషము. కాళిదాసాదులు మార్పులు చేసిరికదా మనమేల చేయరాదు? అని ప్రతి రచయితయు నితివృత్తమును మార్చకూడదు—

"పూర్వే విశృంఖల గిరయః
కవయః ప్రాప్తకీర్తయః
తాన్ సమాశ్రిత్య నత్యాజ్యా
నీతిరేషామనీషిణః"

అని ఆనందవర్ధనాచార్యులనిరి.

"పక్కున నవ్వెన్" అనినప్పుడు అవహేళన భాసించుటలేదని తెనుగువారెవ్వరు ననరు. కాని శ్రీ రమణారెడ్డిగారు దానిని కూడ సమర్థించుటకు యత్నించుట హాస్యాస్పదము. 'పక్కున నవ్వెను' అనగా నిండుగా నవ్వెనని చెప్పుచున్నారు. అది రచయిత అభిప్రాయమై యుండవచ్చును. కాని ఎప్పుడు "పక్కున" అని ప్రయోగింపబడినదో అప్పుడు అవహేళన భాసించి తీరును. తాము కొన్న భావమును గురజాడ స్పష్టముగాచెప్పలేదు.

"దండినృప వొక గండుగారడి కలదు" అని నప్పుడు శ్రీరమణారెడ్డిగారు ఆ శబ్దముల యర్థమును వివరించినారు. కృతజ్ఞులము! శ్రీ సీ. రా. గారి అభ్యంతర మర్థ విషయమున కాదనుకొందును. ఏ శబ్దము తర్వాత నేశబ్దమును ప్రయోగింపవలెనో రచయితకు తెలియదు అని శ్రీ. సీ.రా. గారి అభిప్రాయమై యుండవచ్చును. ఏ శబ్దము తర్వాత నేశబ్దమును ప్రయోగించినచో 'అతుకు'నో తెలిసికొని ఉత్తమ కవులు ప్రయోగించెదరు. అందుకే "పొసఁగ ముత్తెపుసరుల్ పోహణించిన లీలఁ దమలోన దొరయు శబ్దములుగూర్చి" అని పింగళి సూరన చెప్పినాడు. ఇక్కడపోహణించుట యననేమో శ్రీరెడ్డిగారు తెలిసికొన్నచో కృతార్థులమగుదుము. "దండినృప వొక గండుగారడి కల"దని ప్రయోగించుటలో రచయిత యొక్క ప్రాథమికావస్థ స్పష్టముగా వ్యక్తమగుచున్నది.

"దేశభక్తి"ని గురించి చెప్పుచు "భావాలు మహోజ్జ్వలముగా రేగనప్పుడు కవి యలంకారముల నాశ్రయించున"ని శ్రీరమణారెడ్డిగారు ఒక విచిత్రమైన యభిప్రాయమును వ్యక్తీకరించినారు. భావము లువ్వెత్తుగా విజృంభించి నప్పుడే కవి యలంకారములద్వారా సహృదయున కానందము కలిగించును. భావములేనప్పుడు అర్థాలంకారము లెట్లు మనస్సులో జనించును? ఇది స్వల్ప భాషా జ్ఞానమున్నవారికి కూడ తెలియు విషయము. ఇట్లే లయానుబద్ధమైన వచనమే కవిత్వ మనిపించుకొనునని సెలవిచ్చిరి. అనగా "నానన నానన" యని లయానుబద్ధముగా చదివినచో నది కవిత్వమగునా? సంగీత శాస్త్రమందు దానికి స్థానముండునేమో కాని కవిత్వమందు దానికి స్థానము లేదు. ఇక్కడనే 'భగవద్గీత'కును దేశభక్తి గేయము

నకును, పోలిక తెచ్చినారు. భగవద్గీత భారతాం తర్గతమైన శాంతరసము నుద్దీపింప జేయుచున్నది. అందుచేత భగవద్గీత రసప్రయోజనకారి యైనది. దేశభక్తి గేయమునందు కొన్ని అభ్యుదయ కర మని చెప్పబడుచున్న అభిప్రాయములు గలవు. వేకువనేనిద్ర మేల్కొనుము. అనినట్లుగానే ''మంచి యన్నది పెంచుము''. ''దేశి సరకుల నమ్మవలెను'' అనిచెప్పుట కవిత్వ మెన్నటికిని కాదు. దేశభక్తిలో కవిత్వమున్నదని మోసపోవుటకు దానియందలి ఛందస్సే కారణము. కేవలము ఛందస్సునుబట్టి కవిత్వమున్నదనుట ప్రాజ్ఞుల యభిప్రాయము కాదు. అభ్యుదయ వాదులకుకూడ ఈ విషయ మున అభిప్రాయభేదములేదు. ''గురజాడ కవి కాకుంటే కాకపోయె కాని ద్రష్ట'' యనిరి. ద్రష్ట యనగా నెవరో చెప్పుటకిది చోటుకాదు. గురజాడ ద్రష్టయని యంగీకరించినను కేవల ద్రష్ట కవి శబ్దవాచ్యుడు కాడు. '' గురజాడ కవి కాకుంటే కాకపోయె కాని ప్రవక్త'' అని శ్రీ రమణారెడ్డిగారనిరి. శుభము ! ఆ యభిప్రాయ మును శిరసావహించెదము.

"క్రియోన్ముఖులను కావించువాడే సత్కవి" అనిరి. ఏ క్రియకు ? అని నాప్రశ్న— రాజకీయ సాంఘిక కార్యములకు ప్రజల నున్ముఖులుగా జేయ వలయు నన్నచో రాజకీయవాదులు చాలును. ఆ కార్యము చేయుటకు సత్కవిత్వ మనవసరము.

సమాజము తల్లి కాబట్టి కవి "యణగిమణగి" యుండుటలో అభ్యంతరములేదనుచున్నారు. అణగి మణగి యున్నచో కవిలో వ్యక్తిత్వమే యుండదు. అందువలన అతడు విశిష్టుడుగానే ఉండవలెను. "జేమ్సు జాయిస్" సమకాలిక సమాజముచేత దూషింపబడినాడు. అతడన్య దేశములకు వెళ్ళి కావ్యరచన చేయవలసి వచ్చినది. అతడే తన సమ కాలిక సమాజము నందణగిమణగి యుండినచో "యులిసిస్" వంటి గ్రంథరచన చేసియుండెడి వాడా? కవి సమాజమందణగిమణగి యుండరాదు.

పూర్వులందుచేతనే "నిరంకుశాః కవయః" యనిరి. ఈ సందర్భములోననే "కోకిల కొమ్మలోకూసిన" అను విశ్వనాథవారి ప్రయోగము నుదాహరించి కోకిలకొమ్మలో కూయదు–కొమ్మమీదినుండి కూయు ననుచున్నారు. చాలబాగున్నది విమర్శ ! శబ్దశక్తి త్రివిధా విభక్తము. అభిధా, లక్షణా, వ్యంజనా యని. ఇక్కడ లక్షణార్థము చెప్పుకొనవలెను. "ముఖ్యార్థబాధే తద్యోగే రూఢితోఽథ ప్రయోజ నాత్" అని శాస్త్రకారుడనినాడు. అందుచేత కొమ్మలో ననగా కొమ్మమీద అని చెప్పుకొనవలెను. "గంగాయాం ఘోషః" అన్నచో గంగయందు గొల్లపల్లె యుండదు కాబట్టి పై వాక్యము తప్పం దురు కాబోలు! గంగాతీరమున అని పై వాక్యమున కర్థము చెప్పుకొనవలెను. అయినచో గురజాడ వారి అణగిమణగి యన్న శబ్దమునకు లక్షణార్థము చెప్పుకొన గూడదా ? యని యనవచ్చును. అట్లు వీలులేదు. ఇక్కడ ముఖ్యార్థమునకు బాధకలుగ లేదు. ప్రతిశబ్దమునకు లక్ష్యార్థము చెప్పుకొన కూడదు. అట్లు చెప్పుకొన్నచో శబ్దార్థముల ప్రయో జనమై పోవును. కావ్యవిమర్శ చేయునప్పుడు శబ్ద శాస్త్రము నెరిగియుండవలెనని శ్రీ రెడ్డిగారికి మనవిజేయుచున్నాను.

శ్రీ సీ. రా. గారు ఒక సందర్భమున వ్రాసిన "భాషా వ్యభిచారము"ను శబ్దమునకు దురర్థమును కల్పించుకొని కుపితులై శ్రీ రెడ్డిగా రేమేమియో వ్రాసిరి. ఇక్కడ వ్యభిచార శబ్దము నకు తప్పి చరియించుటయని యర్థము. ఈ సందర్భములోననే "ఈనాటికీ గీర్వాణాన్ని చూపుతూ ఆ విభక్తి ప్రత్యయాలను, ఆ సమాస జాటిల్యాన్ని, ఆ శబ్దరూప భేదాలను సాగదీసి సొగసుమాపి తెలుగునకు ప్రయాసతో తగిలించి "మానభంగాన్ని" చేస్తున్న పెద్దలున్నారని "శ్రీ రెడ్డిగారొక విపరీత సిద్ధాంతము చేసినారు. అనగా సంస్కృత సమాసములను ప్రయోగించి నచో మానభంగము చేసినట్లన్నమాట! ఇది చాల

తప్పు అభిప్రాయము సంస్కృతభాషా సంపర్కము వలన తెలుగు నాగరికమైన భాషయైనది. తెలుగు భాషసొగసునకు సంస్కృతమే కారణము. సంస్కృత భాషవలన తెలుగుభాష తెలుగువారి ఊహలు; జీవితము సంస్కృతి; ఆలోచనా విధానము; ఒక టేమిటి సమస్తముకూడ నున్నతమైన స్థితినందు కొనగలిగినవి. ఎన్ని యుగాలకైనను తెనుగుజాతి సంస్కృత భాషయొక్క ఋణమును తీర్చుకొన జాలదు. అట్టి అదృష్టమును శ్రీ రమణారెడ్డిగారు మానభంగ మనుచున్నారు. "అది సభాసీన సకల బుధావతంస ఘనకపిశాన విజ్ఞాన కాంతి మత్ప్రసన్న వీక్షణ స్నాపిత స్వర్ణపీఠి" అనిన శ్రీకృష్ణశాస్త్రిగారు "కాలధూమోద్గత మహాగ్ని జ్వాలికామాలికలో! ఝంఝానిల విఘూర్ణిత నీలవారాంనిధితరంగములో" అనిన శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి గారు; "కవీ! నీ గళగళన్మంగళ కళా కాహళ హళాహళి" అనిన శ్రీశ్రీగారు, రమణారెడ్డిగారి దృష్టిలో మానభంగముచేసిన దోషు లగుదురు కదా! పైని చెప్పిన ముగ్గురు నుత్తమకవులు కాబట్టి సందర్భమున కనుగుణమైన సమాసరచన చేసి తెనుగుభాషకు కైసేత చేసినారు! "సమాస జాటిల్య" మని "శబ్దరూప భేదము" లని, శ్రీ రమణారెడ్డిగారేగీర్వాణశబ్దములనుప్రయోగించిరి. కడకు వారువయోగించిన "మానభంగి" శబ్దము మాత్ర మెక్కడిది? దీనినిబట్టి సంస్కృతము తెనుగులో నే విధముగా జీర్ణించుకొనిపోయినదో తెలియుచున్నది. నిజముగా తెనుగును భ్రష్టము చేసినవారు "పెరిషించు" "ఫ్లరిషించు" "ఇన్వేడించు" అని ఇంగ్లీషు పదముల కసహజముగా "ఇంచుక్కు" ను చేర్చి ప్రయోగించినవారు. సంస్కృతసమాసముల నాంధ్ర భాష యందు ప్రయోగించుట "మానభంగమ"ను వారియూహ అనాగరకమైనది, అసభ్యమైనది.

"తలపులు తక్కువైతే వృత్తాలు నిండడం కోసం గంగిరెద్దుగుడ్డలు మెట్లుపడవలె! ఆగుడ్డలైనా అందముగా అమర్చడంచేత కాకుంటే మాటలు మాసి అన్వయంచెడి పద్యాలు వొంకరికడకలు నడచి కవిత్వం కపిత్వం అవుతుంది" అని గురజాడ వారు చెప్పిరట! కవిశక్తివిహీనుడైనప్పుడు పైవిధముగనె జరిగితీరును. కవి ప్రతిభావంతుడైనచో నాతడుపట్టిన మట్టికూడ బంగారమగును. ప్రభాతి శూన్యుడు "వృత్తము"లే కాదు చిటిపొటి "ముత్యాలసరములు" వ్రాసినను పైనిచెప్పిన గంగిరెద్దుగుడ్డలు మెట్లుపడును.

"రససిద్ధాంతములు ధ్వనిసిద్ధాంతములను గుర్తెరిగి వ్రాయని ఆధునికరచనలను అదృక్కోణముల నుండి విమర్శించడం యుక్తమేనా?" "యనియు," "శిలా శాసనములవలె కాకున్నా లోహపు కవచాలవలె యీలక్షణ ప్రమాణాలు నిలిచి పోయాయి" అనియు శ్రీ రెడ్డిగారనిరి. మహాకవుల రచనలు చదివి, సాహిత్యమూల తత్త్వమును నరనరముల జీర్ణింప జేసికొని త్రికాలములందును భూషింపబడు శాశ్వతాభిప్రాయములను "సలహో"లుగా ప్రాచీనాలంకారికులు మన కందించిరి. వారు చెప్పిన విషయములందొక్కటికూడ నిర్హేతుకమైనదిలేదు. అవి శిలా శాసనములు, వజ్రకవచములును కావు. అందుచేతనే మన రససిద్ధాంతమును, ధ్వని సిద్ధాంతమును పాశ్చాత్యులు వేనోళ్ళ ప్రశంసించినారు.

గురజాడవారి గొప్పతనమును గురించి చెప్పు ప్రతి వ్యక్తియు "బూజును దులిపి కశ్మలాలను క్షాళనముచేసి, ఆరోగ్యకరమైన వాతావరణమును సృష్టించినవాడ"ని ఒకటేపల్లవి నాలాపన చేయుచున్నారు. ఈ పై కార్యములు చేయుటకు "శానిటరీ ఇనస్పెక్టర్లు" చాలును.

"అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే
శృంగారీచేత్కవిః కావ్యేజాతం రసమయం జగత్
స ఏవ వీతరాగశ్చేత్ నీరసం జాతమేవతత్
భావాన చేతనానపి చేతన వచ్చేతనానస్య చేతనవత్
వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే
స్వతంత్రతయా!"

అట్టివాడు కవి. అట్టివాని రచనలు త్రైకాలికముగ నుండును. అట్టివాడు మానవజాతియొక్క నోములకు బంగారుపంట!

# స్వావిష్కృతి | సుప్రసన్న

అంతర సుమనోధర్మము అచ్ఛమైన ఊహ, భావనాపథమునం దుజ్జ్వలత్వ
మిన్నియుండియు నాలోన యేల విరిసికొన్న దీ యహంకా రాగ్నికుండ మిట్లు.

మనసులోనున్న వినయమ్ము మాటలందు కానరాదు, ఎదలోపలి మ్లానభావ
మాననమున దోపదు, దరిద్రావరణము దైన్యమొప్పదు, నృపుని విధాన నేను.

గుండెలలోన ఎప్పుడొ రగుల్కొని నిప్పులు రాల్చుచున్న దీ
మండుట లెంతకాలము ? అమాయికముల్ ఎదలోనికోర్కు లెం
దుండెనొ ఈడ్చివేయబడుచుండెను, కొన్ని నశించు, కొన్ని ని
ల్చుండును. వీని కెంత బలమో యిటు వహ్నుల నాగి నిల్పుటన్.

అంబుదమైన నా హృదయమందలి యార్ద్రితతోడ కొల్చెదన్
అంబుజమైన నా కనులయందలి చిక్కటనాన పోల్చెదన్
అంబరమున్ కనుంగొనిన అచ్ఛత లేదని వెక్కిరింతు, నా
వెంబడివచ్చు నీ సకల విశ్వమటం చని ఊహచేసెదన్.

ప్రకృతిలోనున్న అందము పలుకరించి ఎడద ఊపించి ముగ్ధ చేసెడిది మున్ను-
నే దహంకారవహ్నికల్ నిగుడ సర్వమందు సాధారణత్వమే ఆశ్రయించు.

**ఈ అహంభావ మన్నది ఎరుగనపుడు ఏవొ అనుభూతులు - అవి తమ ఎరుకలేని వార్ద్రిములు, తీవ్రదుఃఖ శ్లథావధులు మనోంతర సముద్ధురమ్ములైనపుడు-నేను-**

తెలియనివేళ నా ఎడద తీరములంజని - ఏమి దీని లో
పల గల యంతరార్థమని ప్రాక్ప్రితి నెంచను, భావనా సము
జ్జ్వల పరిణాహ మెంచను, వచస్థితికందని దాని నేమియో
తెలియగరాని వాక్కులను తీర్చితి - ఆంతర తీవ్రవాదినై.

అర్థమెరుగరాని అనుభూతులకు వేగలేక ఆత్మదృష్టిలేక ఒక్క
అదుపులేని వెఱ్ఱి ఆవేశమున పరిభ్రష్ట వృత్తినైతి, భ్రాంతుడైతి.

ఆవేశమ్ములు విచ్చుకొన్నపుడు నా కానందమేలేదు - అం
తా వీథిబండిపోవు మానిసియె నే నైనాను, దారిద్ర్య దుః
ఖావేశమ్ములు, దుష్ట ధర్మములు, వేదాంతోక్త నైష్కర్మ్య సం
ధావాగ్రీతులు - నా వశ మ్మయిన అంతా క్రొత్తయే విచ్చుచో.

వెఱ్ఱికేకలు, పుఱ్ఱెల వేడుకలు, శ్మశాన భాషలు, విప్లవ శాసనములు
ఏమిచేయు విశ్వము మార్చివేయునా ?... మరీ ఎడదలోన ఆవేశమెట్లు నిలచు?

ఎరుకలేనట్టి అనుభూతి, ఎరుగునట్టి శక్తిలేని ఆవేశము, చచ్చిపోయి-
నిద్రపోయిన నాలోన నే ననియెడు భావమే దీపమయి గుండెలో వెదకును.

పాడిన ఈగీతి పాడితి తొలిసారి నిలచిపోవలె అభ్ర మలమి ఎపుడు.
ఎడదలో పొలిచిన ఈ అగ్నివల్లిక చీకటి కొప్పున చిందె పూలు.

స్వావిష్కృతి స్వరూప ద్విరదమునకు అంబారి నా యూహయై స్ఫురించు
మనసున కేతమైన నవార్థ భారతి ఆనంద వీథిలో నరుగుదెంచు.

వ్యాకృతమ్మైన తొలికావ్యవర్తి వెలిగి ఈ అరుణసంధ్య తుద, చీకటింటిలోన,
ఎపుడొ మరచిన వాల్మీకి ఏగుదెంచె నన్న ఈహోహ స్ఫురించినట్లుచేసె.

హృదయములోన శాంతి చిగిరించెను, ఆరుణమైన రక్త సం
ధ్య దెసల జారిపోయె, తెలి అంచలు రెక్కలు విచ్చియేగిన
ట్లైదిగెను వెన్నెలల్, వెలుగులే పదిదిక్కుల నాక్రమించునో ?
పదిపది గొంతుకల్ విరియు పాటల వాకలలో స్ఫురించునో ?

నిన్నటివరకును పలు విశ్వవిద్యాలయములలో ఆంధ్రశాఖాధ్యక్షులుగా పనిచేసిన శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి పాండిత్యపు బండారము రా. చ. గారును (భారతి— మే. పుస్తకసమీక్ష), ఉపాధ్యాయుల నరసింహమూర్తిగారును (జయంతి— జూన్. పుస్తకసమీక్ష) బయటపెట్టిరి. ఇంతకు దూతమత్తేభము రాయప్రోలు సుబ్బారావుగారు రచించినది కాదేమో అన్న సందేహముకూడ భారతి సమీక్షకులు వెలిబుచ్చిరి. ఇన్నితప్పులు వ్రాసికూడ గ్రంథముప్రకటించుసాహసము తెలుగు దేశములో ఇంకొకరికున్నదాయని నాసందేహము. మాతృశబ్దముయొక్క సంబోధన ప్రథమావిభక్తి ఏకవచనరూపము 'మాతే' అని వ్రాయగల సామర్థ్యముకూడ రాయప్రోలు సుబ్బారావుగారికే యున్నది. శబ్దమంజరిలోని ఋకారాంత స్త్రీలింగ శబ్దముదగ్గర ఆగిపోయిన పాండిత్యముగల మహాశయులు కాళిదాసువద్ద కెగిరినచో దుష్ఫలితములు తప్పవు.

నవ్యకవిత్వముపట్టిన అపమార్గము లన్నింటికి రాయప్రోలు సుబ్బారావుగారొకప్పుడు లక్షణము తేర్పరచి వానిని కొన్నిప్రమాణములలో నొదిగించిరి. వారిప్పుడొక వ్యాకరణ శాస్త్రమును నిర్మించినచో ఈదోషములన్నియు దానిలో నొదుగ వచ్చును. అది 'వ్యావహారికభాషావ్యాకరణము'న కన్న చెడిపోవునా ? 'మత్ + క్షేమము'ను కలిపి 'మక్షేమము' అని వ్రాయుట దోషము కాదని వ్యాకరణ శాస్త్రములో వ్రాయగల మహానుభావులు వాఙ్మయాధ్యక్షులగుచున్న కాలములో ఏదివ్రాసినను చెల్లవచ్చును. కాక యేఆచార్యుల వారైనను మరల నొకశాస్త్రగ్రంథమువ్రాసి ఈదోషములు గుణములుగా నిరూపింప పూనుకొన వచ్చును. ఆంధ్రధ్వన్యాలోకములో రాయప్రోలు వారి పద్యములు గుణముల కుదాహరణములై వారికన్న సమర్థములైన ఇతరులవి దోషముల కుదాహరణములైనట్లు ఇందులోకూడ రాయప్రోలువారి ప్రయోగములు సాధువులై ఇతరులవి అసాధువులు కావచ్చును.

ఎందుకు వ్రాయవలసివచ్చుచున్నదనగా తెలుగునాట విమర్శ కొకప్రమాణములేదన్నమాటకు రమణారెడ్డిగా రుద్రిక్తులైనారు కాబట్టి (జయంతి. జూన్. చర్చావేదిక). కవిత్వముయొక్క గుణదోషముల విచారణ ఈదేశములో కులమును బట్టి, అధికారమునుబట్టి, ప్రాంతమునుబట్టి, రాజకీయాభిప్రాయములనుబట్టి అనేక విధములుగా కొనసాగుచున్నది. కనుకనే విమర్శకొక ప్రమాణము లేదనిచెప్పుట. అంతేకాని జడమైన యొకశిలాకృతిని నిలబెట్టి దానిని పరమేశ్వర స్వరూపముగా నారాధింపుమని చెప్పుటకొరకు కాదు. రచయితయొక్క లౌకికస్థితినిబట్టి తమ కొలబద్దలను మార్చుకొను దయనీయస్థితికి పాల్పడిన విమర్శకులున్నచోట ఈమాటచెప్పుట దోషము కాదనియే నాయభిప్రాయము. తెలుగు విమర్శకులే సుముహూర్తములో ఈదుర్మార్గము పట్టిరో తెలియదుకాని ఇప్పటికిని నిర్విఘ్నముగా ఆమార్గమందు ప్రయాణము చేయుచునే యున్నారు.

విశ్వవిద్యాలయాంధ్రశాఖాధ్యక్షులను గురించి చిన్నమనవి. పాపము! రాయప్రోలువారు చిన్నబుచ్చుకొనయవసరములేదు. వారికితోడుమరికొందరున్నారు. ఒక విశ్వవిద్యాలయాంధ్రశాఖాధ్యక్షులు ఒకరాష్ట్రమంత్రి కేంద్రమంత్రియైన సందర్భములో వీడ్కోలుసభ జరుగుచుండగా, 'మనసారథి మన సచివుడు...మనలను విడనాడి చనియె' అను పద్యము చదివిరట. వారే మరొకప్పుడు ఉత్ప్రేక్షను ఉపమాలంకారమున కుదాహరణముగా చెప్పిరట. ఆచార్యులైన వారి భాషాజ్ఞాన మిట్లున్నప్పుడు వారి శిక్షణలోనున్న విద్యార్థుల సంగతి ఊహించుకొనవచ్చును. ఎంతసేపటికిని విద్యార్థుల ఇంగ్లీషు భాషాజ్ఞానము సన్నగిల్లిపోవుచున్నదనియే దేశములో గోల జరుగుచున్నదిగాని తెలుగు భాషను గురించిన పట్టింపులేదు.

ప్రమాణ వ్యవస్థాదులమాట యెట్లున్నను, రమణారెడ్డిగారొక చక్కనిమాట సెలవిచ్చినారు గురజాడ అప్పారావుగారి స్థానము **దేశి పునర్విలసనములోనే** యని. ఆ దేశిమార్గములో కవిత్వము వ్రాయుచున్న వారిలోకూడ అప్పారావుగారి స్థానమెంతటిది అన్న ప్రశ్న పుట్టవచ్చును. అది వేరేచర్చ.

దోషము కానిది గుణమని రమణారెడ్డిగారొక విచిత్ర సిద్ధాంతమును లేవదీసినారు. ఆ భావము భావము కాదు. విషము కానిది అమృతము కానక్కఱలేదు. నీరు కావచ్చును. మఱొకటి కావచ్చును.

మాస్కో విషయము వచ్చునప్పటికి రమణారెడ్డిగారు మహోద్రిక్తులై అనేకవిషయములు మఱచిపోయినారు. మృచ్ఛకటికము గొప్ప నాటకమే. ఎందుచేత? వసంతసేన వేశ్యయగుటచేతనా? ఆ నాటకముయొక్క నాటకత్వము వసంతసేన యొక్క వేశ్యాత్వముపై ఆధారపడియున్నదా? ఈ యధమ పురుషజాతి కొందరు స్త్రీలను తమ సామూహిక పశుతృష్ణకు లోబరచుకొనుచున్న దన్న భావముచేత ఆ నాటకము వ్రాయబడినదా? పాపము! శూద్రకున కా గోల తెలియదు. ఇరువదవ శతాబ్దములో కొంతమంది విచిత్ర ప్రకృతులు బయలుదేరి నాయికయొక్క వేశ్యాత్వము కారణముగా తన నాటకము మిన్నుల కెత్తుదురనికూడ తెలియదు. ఇంతకును మృచ్ఛకటికమునకు కన్యాశుల్కమునకు సామ్య మెచ్చట? వసంతసేనా మధురవాణుల వృత్తియందు తప్ప ఇంకొకచోట సామ్యము కనపడుటలేదు. ఇతర లక్షణముల నన్నిటి నధిగమించి వీరిరువురి వేశ్యాత్వము నేటి వారి కెక్కువ ప్రియమైనది. ఇవి రెండే గొప్ప నాటకములని భావించినవారిని రమణారెడ్డిగారు మూర్ఖులన్నారు. మూర్ఖులెవరో నాకు తెలియదు గాని శ్రీశ్రీగారు మాత్రము ఇట్లు సెలవిచ్చినారు. 'నా దృష్టిలో భారతదేశంలో వేయి సంవత్సరాల నుండి రెండేరెండు ఉత్తమ నాటికలు వచ్చేయి. ఒకటి మృచ్ఛకటికము, రెండు కన్యాశుల్కము.' (అభ్యుదయ-మార్చి-పుట 7)

తుదకీ యుద్రేకములో రాజకీయములలో పలుమారు నలిగిన ప్రచార వాక్యములు వ్రాయుటకు కూడ వారు వెనుదీయలేదు. పాల్ రోబ్సన్ సంగీత విద్యా వైశారద్యమును గుర్తించని జాతి అనాగరక జాతియే. కాని పాస్టర్ నాక్ సంగతి యేమి? అంతప్రసిద్ధికెందిన మయకొవిస్కీ ముప్పదినాలుగేండ్ల వయస్సులో (1930) ఆత్మ హత్య చేసికొనుటకు కారణమేమి? రష్యన్ సాహిత్య చరిత్రకారుడైన డి. యస్. మిర్స్కీ ఈ ఆత్మహత్యనుగురించి మిక్కిలి నిర్దయగా వ్రాసెను. తుదకు ఆ మిర్స్కీ ఏమైపోయినాడో ఎంత శోధించినను బయటపడలేదు. చెప్పదలచిన విషయ మేమనగా ఈ దుర్లక్షణములు నేడన్ని జాతులును పట్టించుకొనినవి. దానికందరిని నిందించవలయునే కాని కొందరిని నిందించి కొందరినిభూషించుట పనికిరాదు.

అభిజ్ఞాన శాకుంతల వ్యాసములలో విశ్వనాథ సత్యనారాయణగారు అంతఃకరణ లక్షణమును గూర్చిచెప్పిరి. వేదాంతశాస్త్రము సర్వము క్రిందు మీదుగా చదివినవారుగూడ జీవుడనగా నేమిటో అంతఃకరణమనగా నేమిటో నింత స్పష్టముగా చెప్పలేరు. చెప్పుటకుముందు ఆ విషయము సరిగా అర్థము చేసికొనవలయును. అర్థము చేసికొనుట యనగా అనుభవములోనికి తెచ్చుకొనుట. అనుభవములోనికి తెచ్చుకొననివాడు చెప్పినమాటలు కస్తూరి అనగా ఒకవిధమైన పరిమళద్రవ్యము అని యర్థము చెప్పినట్లుండును. కస్తూరి యనగా నేమో తెలిసినవాడు దాని పరిమళము యొక్క లక్షణము, దాని పరీక్ష, దాని రంగు సర్వమును చెప్పగలడు.

తేలికగా చెప్పుటకు వీలుపడని కొన్ని హృదయస్పందనము లుండును. వానిని స్పష్టముగా ఎదుటివాని హృదయమునకు హత్తుకొనునట్లుగా చెప్పగలిగిన వా డుత్తమకవి యనుటలో సందేహము

లేదు. నాయని సుబ్బారావుగారట్టికవి. సాక్ష్యము వేదనావాసుదేవము. 'తల్పు తెఱవంగా నీవు పొంచుండి మెల్పున సారించిన కుంచెకోల మొన త్రిప్పుల్ నాకు గిల్గింతలై' మొదలైనవి ఉదాహరణములు.

కథకులుగా ప్రసిద్ధులైన జమదగ్నిగారి పద్యములు జయంతిలో ప్రకటింపబడినవి. ఈ జయంతి వారికి కవిత్వమునం దధిక ప్రేమ యున్నదా? లేక జమదగ్నిగారు కథలు వ్రాయుట మానుకొన్నారా? ఇది వారి పద్యమును గూర్చిన నింద కాదు. పద్యములు చక్కగానున్నవి.

నా వాదమునకు ప్రోత్సాహకముగా నన్నట్లుగా శ్రీ గూడూరి సీతారాంగారు స్రవంతిలో ఒక కథ వ్రాసిరి. (రాజమ్మరాజీరికం). సీతారాంగారున్న పరిసరములలో తప్ప ఇందులోని శబ్దము లనేకములు ఇతరులకు తెలియవు. గ్రాంథిక భాషకన్న ఈ గ్రామ్యభాష అర్థముచేసికొనుటయే కష్టము. కొందరు మాత్రము ఇతర ప్రాంతములవారు తమ ప్రాంతము వారు మాట్లాడుకొను భాష వ్రాసినచో సంతోషించి తెలంగాణీయులు అచ్చముగా తాము మాట్లాడుకొనుభాషలో వ్రాసినచో ఏవగించుకొనుచున్నారు.

స్రవంతి జూన్ సంచికలో సుప్రసన్నగారి జలవేణువు ప్రకటింపబడినది. సుప్రసన్న మిక్కిలి సుకుమారముగా ఊహించగల కవి. కాని ఆయన సర్వ సౌకుమార్యము అస్పష్టప్రకటనలో వ్యర్థమైపోవుచున్నది. 'నాద దిదృక్షు' యేమిటి? దిదృక్షయనగా చూడవలయునన్న ఇచ్ఛ. రమ్యమైన వస్తువును చూచి, మధురమైన శబ్దమును విని విశిష్టప్రకృతు లందరును పర్యుత్సుకులగుచున్నారు. తమ యనుభూతికి ఒక స్పష్టమైన ఆకృతిని గూర్చగలవారే వారిలో కవులగుచున్నారు. తదితరులగుటలేదు. మననము కొఱవడినచోట అస్పష్టత యెక్కువగును. ఒక కవిలో అస్పష్టోక్తి యున్నదనగా ఆ కవికి తనయనుభూతినిగూర్చిన గాఢభావన లేదనియర్థము.

యువకులైన రచయితకు తొందరపాటు ప్రథమ శత్రువు. నాలో ఏదో సంచలనము కలిగినది అని ఎవరైనను చెప్పగలుగుదురు. దానికి కవి యక్కఱ లేదు. అస్పష్టతనుకూడ కవితాలక్షణములలో చేర్చువారు లేకపోలేదు. సుప్రసన్న వారిలో నొకరు కాదుకదా!

సోమసుందర్ గారి మధుహాస (స్వతంత్ర - 8 జూన్) నేను జయంతి 8 లో వారినిగూర్చి వెలిబుచ్చిన భావమును బలపరచుచున్నది. 'బ్రతుకు కడగండ్ల కాపెళ్ళబరువుబడిన మార్గణాయాన ఖిన్న తల్ బాపుకొనిరి' మార్గణమనగా బాణము. కానిచో యాచకుడు. కానిచో బాగుగా వెదకుట. 'కలమ్బ మార్గణ శరాః పత్రీ రోప ఇషు' 'వనీయకో యాచనకో మార్గణో యాచకార్థినౌ' 'సంవీక్షణం విచయనం మార్గణా' అని అమరము. వారీ శబ్దమును మార్గమునకు బదులు వాడినట్లున్నారు. ఇది కవితా రచనలో ప్రాథమికులైనను చేయకూడని దోషము.

శ్రీ వాత్సవగారి విళంబిసాహిత్య సమాలోచనలో ఏడవ వ్యాసము వచ్చినది. (స్వతంత్ర జూన్-8) పుస్తకములు, పత్రికలు చదువకుండగనే వీరి వ్యాసములు వ్రాయుచున్నారనుట కీ వ్యాసము సాక్ష్యము. గురజాడ అప్పారావుగారు కవి కాదని విశ్వనాథ సత్యనారాయణగారు ఎప్పుడో అనగా అది తీసికొని వారి శిష్యుడొకడు 'జయంతి' లో అప్పారావుగారు కవి కాదని వ్రాసినాడని వీరు వ్రాసినారు. అప్పారావుగారి విషయములో జయంతి పత్రికలో ప్రకటింపబడిన వ్యాసములలో విశ్వనాథ సత్యనారాయణగారి మాటలనెవ్వరును పేర్కొనలేదు. పేర్కొన్నది శ్రీ రసుణారెడ్డిగారు. వ్రాసినది అభ్యుదయ పత్రికలో. ఆమాటల సారాంశము గురజాడ కవి కాదని కాదు. ఆయన కవియనియే. ఆయన యట్లన్నప్పటికిని అప్పారావుగారు కవి కాడని. విశ్వనాథ సత్యనారాయణగారి విషయములో కూడ వ్యవహారాపతితమైన ప్రతివాక్కునకు ప్రామాణ్యముండుట సంభవము కాదని

జయంతిలో వ్రాసినవారు జువ్వాడి రామేశ్వర రావుగారు. అననిమాట నన్నట్లుగా, శిష్యుడు కాని వానిని శిష్యుడుగాచెప్పగలిగిన సమర్థులుశ్రీనివాత్స గారు. నన్నెచోడునిగూర్చి వేదం వేంకటరాయ శాస్త్రిగారు వ్రాసిన గ్రంథము చూడకనే దానిని గురించి వీరు తమ యభిప్రాయమును వెలిబుచ్చి నారు. వీరి విశంబి సాహిత్య సమాలోచనములో గోపదేవ్ గారి షడ్దర్శనములుకూడ చేరినవి. అవి యెన్నడో ప్రకటింపబడిన గ్రంథములు. ఇంకొకటి వానిలోని తెలుగు సరళమైనదట. అగునో కాదో చదివినవారికి తెలియును. కాని విమర్శనలువ్రాయు వారికెట్లు తెలియును ? నిర్వ్యాపారత యెక్కువైనచో ఇంటిలోకూర్చుండి చక్కగా రేడియో వినవచ్చును. అప్పటికిని తోచకపోయినచో తెలుగు సినిమాలకు పోవచ్చును. ఇంకేదైన చేయవచ్చును. కాని ఏ విషయమై వ్రాయుచున్నామో దానిని గురించిన సాధారణ పరిజ్ఞానమైనను లేకుండ విమర్శావ్యాపారమునకు దిగరాదు.

ఆంధ్రపత్రికలో ప్రకటింపబడిన కథలలో మధురాంతకం రాజారాంగారి విధివిలాసము (10-6-59) శ్రేష్ఠమైనది. ఈ కథ సగమువరకు చదువునప్పటికి పేలవముగా అంతమైపోవుచున్నట్లనుపించును. కాని అంతటితో ఆగక అక్కడ ఒక మలుపు తిరిగి చివరకొక విచిత్రమైన రహస్యము బయటపడి కథాస్వరూప మంతయు మారిపోవును. మరికొన్ని కథలుండును. ఈ పుటపైకాదు ఇంకొక పుటపై కథ మొదలగునేమో అని చదువుకొనువాడు చదువుకొనుచునే పోవుచుండును. తుదకు మొదలుకాకముందే ఆ కథ అంతమైపోవును. రాచకొండ విశ్వనాథశాస్త్రి గారి 'వర్షం' (27-5-59) అటువంటి కథ.

'అన్వేషణ' యను నవల పోతుకూచి సాంబశివ రావుగారిది. ఆంధ్రపత్రికలో సీరియల్ గా ప్రకటింపబడుచున్నది. ఇందులో అనవసరములైన వర్ణనలధికము. ఈవర్ణనలంత దీర్ఘముగా ఏప్రయోజనము నుద్దేశించి రచయిత చేయుచున్నారో తెలియదు.

స్వతంత్ర (30-5-59) లో మంజుశ్రీ రచించిన క్రొత్తబాటను గురించి ఒక ప్రశంస ప్రకటింపబడినది. సమకాలీన సాహిత్యమును గురించి అప్పటికప్పుడు సమీతులు ప్రకటింపబడుట ముదావహము. మంజుశ్రీ యువరచయిత, విద్యార్థి. ఈ నవలలో హైదరాబాదు వీధులపేర్లను గురించిన యనవసరములైన వివరములు కలవు. మనస్సు, బుద్ధి, హృదయము మొదలైన వానిని గురించి చెప్పినమాటలు పేలవములుగా నున్నవి. ఈ యల్ప విషయముల నధిగమించి, ఏది వ్రాసినను ఎక్కడనో యొకచోట పాఠకుల కన్నులు చెమర్చునట్లు వ్రాయగలశక్తి మంజుశ్రీ కున్నది. దాని యంతట నదొక మహా విషయము. పురుష పాత్రలను తీర్చి దిద్దుటలో ఈ రచయితకు కలిగిన సాఫల్యము స్త్రీ పాత్రల విషయములలో కలుగలేదని చెప్పవలసి వచ్చును.

భారతి కనుల పండువుగా వచ్చినది. విశ్వనాథ సత్యనారాయణగారిని ముందుంచుకొని వచ్చినది. (విశ్వనాథమధ్యాక్కరలు. శ్రీగిరిశతకము)

కోరి, కబేలాకు మందగా దోలికోని పోవుచు నుండ దారిప్రక్కనయున్న పచ్చిగడ్డిపై దారాడు పసుల తీరుగా నున్నది జనుల భోగాళ;

గుండియను కోతలు కోయుచున్న ఈభావమును సర్వాంధ్ర కవులలో ఇట్లొక్క విశ్వనాథ సత్యనారాయణగారే చెప్పగలరు. ఈకవి మిక్కిలి అహంకారి యని గర్వము కలవాడని లోకములో చెప్పుకొందురు. 'నేనెంత! నా బ్రదుకెంత, సృష్టిలో నిజము నావంటి మానవుల్ మూడు కాలముల బుట్టుచు మడియు చున్నారు.' బాహ్యములైన సహస్ర విషయముల నధఃకరించి యొకానొక అంతరజ్యోతి ఈ కవిత్వమునందు ప్రకాశించు చున్నది. దానిని దర్శించలేనివారి కవితాపఠనము వ్యర్థము.

పుట్టపర్తి నారాయణాచార్యులవారి కిష్కింధా కాండములోని కొంతభాగము భారతిలో ప్రకటింప బడినది. తార మొదట లక్ష్మణుని కూర్మికగా తరువాత సీతాదేవిగా, తుట్టతుదకు 'తన చెలియ లైన శాంతాదేవి'గా కనపడినదట. ఔచిత్యము విచార్యము.

శ్రీ సాలువ కృష్ణమూర్తిగారు విశ్వనాథవారి కవిత్వమునుగూర్చి మరల నొకవ్యాసము వ్రాసినారు (కిన్నెర శృంగారము). కిన్నెరసాని పాటలలోని కొన్నిభావములను, లాగిలాగి భర్తృహరి కాళిదాసాదుల శ్లోకములతో ముడిపెట్టుట జరిగినది. ప్రియాప్రియుల పరస్పర పాదసంవాహనాదులు సర్వమానవుల అనుభవములోనున్న విషయములు. అవి సర్వకవులును చెప్పుదురు. ఇద్దరుకవులు సరిగా ఒకేవిధముగా చెప్పినంతవరకు ఈపోలికలు అనవసరములు.

ఈసారికి భారతిలో సశేషవ్యాసము లెక్కువైనవి.

కేవలము 'సశేషమంజరి'యైన నవభారతి మే సంచిక జూన్‌సంచికగా వచ్చినది. ఈ మే—జూన్ సంచికలో చదువవలసినవి రెండు, గంగాలహరి అనువాదము, రామాయణ కల్పవృక్షములోని శివధనుర్భంగ పద్యములకు వ్యాఖ్యానము. ఈ 'సాహిత్య సాంస్కృతిక' సంపాదకీయము రాజకీయముగా నున్నది. —సమవర్తి.

*పుస్తకసమీక్ష :*

## మహోదయం

చెఱుకుపల్లి జమదగ్ని శర్మ

రు. 1-50 పుటలు 55

ప్రకాశకులు :
తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు,
మునిరావువీథి, కడప.

గొప్ప కవిత్వమునకు కావలసిన పదార్థములు రెండు. ఒకటి రసావేశము. రెండవది శిల్పము. ఒకటి హృదయసంబంధి. రెండవది బుద్ధిసంబంధి. వట్టి యావేశమే యుండి శిల్పములేనిచో కవిత్వము రాణించదు. వట్టి శిల్పముండి యావేశము లేనిచో ఎండు కట్టె వలె నుండును. రెండును నున్నపుడే కావ్యము చర్వణాయోగ్యముగా నుండును. ఆ రెంటిలోను రసావేశము ప్రధానమై శిల్పము తద్వ్యంజకముగా నుపయుక్తమైనచో ఆ కావ్యమెంత చిన్నదైనను దానిని సత్కావ్యములలో చేర్చవచ్చును. కాళిదాసుని మేఘసందేశమునకు మహాకావ్యత్వ మీ దృష్టిలోనే కుదురును.

ఈ కావ్యరచయిత తెనుగుదేశమునందు కావ్యరచయిత సుప్రసిద్ధులు గాకపోయినను పలుమంది సుప్రసిద్ధులకంటె గొప్ప కవి. ఈ గ్రంథమునందీయనచూపిన ప్రతిభావ్యుత్పత్తు లసామాన్యమైనవి. విశేషించి నేటి కాలమునందు అపురూపు.

ఈ చిన్ని కావ్యములో ధర్మవీరము ప్రబంధధ్వని. మహాంధ్రజనులందరు ప్రాంతీయాభిమానములువిడిచి ఏకముగా మసలినచో మహోదయము పొందగలరని గ్రంథతాత్పర్యము. ఈ తాత్పర్యమును బట్టియే దీనికి మహోదయ మను పేరు పెట్టుట యుచితముగా నున్నది. కవి యొక్క రచనాశక్తి సగము గ్రంథమునకు పేరుంచుటలోనే బయటపడును.

కాని గ్రంథము యొక్క సొగసు ఈ యభిప్రాయమును ప్రకటించుటలో లేదు. ఈ యభిప్రాయము క్రొత్తదేమి కాదు. ఈ యభిప్రాయమును తెలిసికొనుట కీ గ్రంథము మనము చదువనక్కఱ లేదు. కాని ఈ తాత్పర్యము దీపింపజేయుటకు

కవి యవలంబించిన మార్గము బహు విశిష్టమైనది. ఆ యభిప్రాయమును దీపింపచేయుటలో కవికి గల రసావేశము లోతైనది.

తెలుగుదేశములో సీమావిభాగము నదులనుపట్టి జరిగినది. ఇది తెనుగుదేశము యొక్క వైశిష్ట్యము. తెలుగువారికి రక్తములో జీర్ణించియున్న ప్రాంతీయాభిమానము ఈ నదుల నాధారముగా చేసికొని వ్యంగ్యమొనర్చినాడు కవి. మరియొకటి ఈ నదులన్నియు పోయి సముద్రములో పడును. ఆ సముద్రున కీనదులన్నియు నొక్కటే. అనగా తెలుగు ప్రజలందరూ నొక్కటే. కారణము తెనుగుదేశము పొడుగునను ఆ సముద్రమున్నది. ఈనదులు మాత్ర మొక్కొక్క ప్రాంతమునందే ప్రవహించుచున్నవి. ఈ భౌగోళిక పరిస్థితిని చక్కగా వినియోగించుకొన్నాడు కవి. కాని ఆ సముద్రుని చూపు తెలుగుదేశమంతా పడుటకు వీలులేదు. అందుచేత ఆకాశవాణి యవసరమైనది. అంతేకాక ఆకాశవాణి చెప్పినదానికి తిరుగుండదు. ఇట్లు నదులను, సముద్రమును, ఆకాశమును తీసికొని ప్రాంతీయ సంకుచితత్వమును అనంతత్వములోనికి సాగగొట్టినాడు కవి. తెలుగు నదులు దేనికది వేరువేరు. ఆ ప్రాంత ప్రజలు ఎవరికివారు వేరువేరు. సముద్రము ఏకము. ఆ సముద్రునికి తెనుగు నదులన్నియు ఒక్కటే. తెలుగు ప్రజలందరూ నొక్కటే. కాని అతనికి ఆ నదులతో పనియున్నది. మోమోటము ఉన్నది. అందుచేత తాను చెప్పదలచుకొన్నదంత చెప్పలేదు. ఆ సముద్రవుకూడ భూమిమీద నే యున్నదికదా. అందుచేత ఈ సంగము వలన సముద్రునికికూడ ఈ మహా సందేశమును చెప్పు నర్హతలేదు. మఱి యాకాశము ఇట్టి సంగము లేనిది. ఉదాసీనమైనది. సాక్షిస్వరూపమైనది. అందుచేత ఐక్య సందేశమును వినిపించు నర్హత ఏకము ననంతమునైన యాకాశమునకే యున్నది. కవి అంతయెత్తుననుండి తెలుగుదేశమును దర్శింప గలిగినాడు. ఆయా ప్రాంతముల విజ్ఞాన విభవములకు తన్మయుడైనాడు. ఆయా ప్రాంతీయుల మితిమీరిన యభిమానౌద్ధత్యములకు కుమిలిపోయినాడు. వ్యక్తిత్వమునువీడి యేకత్వమును సాధించినపుడే ముక్తియని ముక్తకంఠముతో చెప్పినాడు. కవి తనయొక్క యనుభూతిని శిల్పమయముగా పరచి చూపించి చరితార్థుడైనాడు. ఇది ప్రధానమైన శిల్పము.

మరి రచనయున్నది. ఏనదిని గురించి వ్రాయునపుడు ఆనది మన కంఠ్లకు గట్టినట్లు వ్రాయగల శక్తి ఈయన కున్నది. ఆయా నదుల నడకలకు వ్యంజకమైన ఛందస్సును సంతరించుకొనుటలో కవియొక్క రచనాశిల్ప మంతయు వ్యక్తమగుచున్నది.

అదిగదిగో అదిగదిగో ఆకూల మీకూల
మెరసి పారెడు గోదావరీ...

పగణమున కా గణము తెగగొట్టి వ్రాయుట వలన గోదావరియొక్క నిండుతనము, గాంభీర్యము వ్యక్తమగుచున్నవి. మరి కృష్ణ యట్టిది కాదు. ఆమె తొందరకత్తె. పరుగెత్తి పోవుచుండును.

కుణుకుణు కంకణ నిక్వణములెగగ
ఘల్లుఘల్లని నూపురములు మెరయగ......

ఈరచనలో కృష్ణానది వేగమంతయు ధ్వనించుచున్నది. అట్లే తక్కినరచనలుకూడ, సముద్రము వద్దకు వచ్చుసరికి తరంగము లొకదానివెంట నొకటి విరిగివచ్చుచున్న ట్లున్న రచన.

అనువుగాని మితిమీరిన అభిమానము హానికరము
మితిమీరిన అభిమానం మితిమీరిన అభిమానం
హానికరం హానికరం ముమ్మాటికి హానికరం...
తరువాత—
ఉన్నచోట నిలువలేక ఉరికి ఉరికి పడిపోయే
ఝురులపేర గిరులుగీసి ధరణి వ్రక్కలిస్తారా
అవని తునియచేస్తారా!

మొదటి రెండుచరణములు కెరటములు ఒడ్డునకు విరుగుట చివరి యర్ధచరణము కెరటము వెనకకు విరుగుట ధ్వనింపచేయుచున్నవి.

ఆకాశవాణి రచనయందు ఈవిధమైన నడకలు లేవు. ఊరక యెచ్చటినుండియో చెవిలో ఊదుచున్న ట్లున్న రచన. గాలిలో కలిసి యెచ్చటినుండియో వచ్చుచున్న సంగీతమువంటిరచన.

'ఆకాశమున లేదు అర్ణవమ్మున లేదు
అవనిలోనే కలదు సీమా విభాగమ్ము
అవని రసమయమయితె అందులోనూ తొలగు
ఆ కొద్ది వేర్పాటు కూడా'

మొదలైనవి.

ఇంతచక్కని యాలోచన అక్షరముదగ్గరనుండి ప్రబంధధ్వనివరకు నిష్కృష్టముగా చేసిన రచన యిది. మరి అందమైన భావములు ఉపమానములు మొదలైనవి ఈ గ్రంథములోనుండి ఎత్తిచూపించవలసిన యవసరములేదు. ఈ గ్రంథకర్త ఒక మహాకావ్యము వ్రాయుటకు తగిన ప్రతిభావ్యుత్పత్తులు కలవాడని ఈ చిన్నిగ్రంథము రుజువుచేయుచున్నది.

—ఉపాధ్యాయుల నరసింహమూర్తి.

## విజ్ఞానయాత్ర - కుటీర పరిశ్రమలు

రచన :

శ్రీ కె. వి. వి. సత్యనారాయణశర్మ,

మునిసిపల్ హైస్కూలు, గాంధీనగరం, కాకినాడ.

వెల : ఒకరూపాయి పుటలు 45

రచయిత ఈ చిన్నపుస్తకంద్వారా ఆంధ్రదేశంలోని కుటీరపరిశ్రమలను పరిచయం చేయడానికి ప్రయత్నించారు. ఒకకాలంలో మహారాజులు మొదలుకొని మామూలు మనుషులవరకు అందరి ఆదర సహకారాలవల్ల అభివృద్ధిచెందిన అనేక కుటీరపరిశ్రమలు ఆంగ్లపరిపాలకుల కాలంలో అట్టడుగున పడిపోయినవి. మనుష్యునిలోని కళాకౌశలమును వ్యక్తపరచే చేతిపనులను నామమాత్రావశిష్టంచేసి మరలను ప్రవేశపెట్టారు, ఆంగ్లపరిపాలకులు. పారిశ్రామిక విప్లవపు ఈయుగంలో భారతదేశంలో కుటీరపరిశ్రమలకు స్థానముకల్పించి భారీ యంత్రపరిశ్రమల దాడినుండి వాటిని రక్షించడం చాలా క్లిష్టమైన సమస్య. భారతప్రభుత్వం ప్రచారదృష్టితో జనరంజక సాహిత్య పోటీలనుపెట్టి కుటీరపరిశ్రమలనుగురించి తెలిపే గ్రంథానికి బహుమతి ఇవ్వడం కొంతవరకు ముదావహమే. రచయిత పరిశ్రమలనుగురించి పరిచయం చేయడానికి చక్కని పద్ధతిని అనుసరించారు. ఒక గ్రామంలో కరణంగారింట్లో రచ్చచావడిలో గ్రామంలోని నలుగురూ ప్రోగవుతారు. మునసబుగారు ఉప్పాడ జరీ అంచుల తలపాగా, చేతిలో దండపిండి మీద సింహతలాటం చెక్కిన పొన్నుకట్టుతో రచ్చ చావట్లోకి దయచేస్తారు. సంక్రాంతి పండుగ కాబట్టి కరణంగారి పిల్లలు బొమ్మల కొలువు తీరుస్తారు. ఆ కొండపల్లి బొమ్మలు, మునసబుగారి చేతికట్టతో ప్రారంభమవుతుంది అక్కడ చేరిన నలుగురి సంభాషణ. కరణంగారు విపులంగా ఆంధ్రదేశంలోని కుటీరపరిశ్రమలను గురించి చెప్తారు. సంభాషణ ముగిసిన తర్వాత సుబ్బయ్య అనే రైతు ఇల్లు చేరుకుంటాడు. రాత్రి కలలో అతను విజ్ఞానయాత్ర చేస్తాడు. ఆ స్వప్న విహారంలో అన్ని గ్రామాలూ తిరిగి అక్కడి పరిశ్రమల్ని గురించి తెలుసుకుంటాడు. ఇంతలో తెల్లవారుతుంది. పాలికాపు వచ్చి పిలిచిన కేకతో అతనికి మెలకువ వస్తుంది.

కథారూపంలో చెప్పడంవల్ల చదువుతుంటే విసుగనిపించదు.

భాష కూడ సరళంగా సాగింది.

—నంతపురి రఘువర్మ

## స్వీకృతి :

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీకృష్ణాతిమానుషతత్త్వము (ప్రథమ ఖండము) | దివి రంగాచార్యులు, రామమోహనాయుర్వేద కళాశాల, గుంటూరు. | పుటలు 188 రు. 5 |
| 2. | యుగళగీతి (పద్యకావ్యము) | పరాశరం గోపాలకృష్ణమూర్తి, సిద్దిపేట. | పుటలు 32 0.50 న.పై. |
| 3. | తిక్కన (గద్యనాటిక) | మండలపర్తి ఉపేంద్రశర్మ, హిందూకాలేజి, గుంటూరు. | పుటలు 54 ఒకరూపాయి |
| 4. | మన విషయం | మండలపర్తి ఉపేంద్రశర్మ, హిందూకాలేజి, గుంటూరు. | పుటలు 38 0–12–0 |
| 5. | ధ్రువవిజయము | వంగిపురము కృష్ణమాచార్యులు, ప్రాప్తిస్థానము : 50, జనరల్ ముత్తయ్యా మొదలివీధి, సాహుకార్పేట, మద్రాసు-1. | పుటలు 122 రు. 3.00 |
| 6. | భక్తిగీతములు | యఱ్ఱగుంట్ల సీతాలక్ష్మమ్మ, జార్జిపేట, అనంతపురం. | పుటలు 44 0–8–0 |

## వచ్చే సంచికలో

మధురాంతకం రాజారాం

రమణారెడ్డి

మిరియాల రామకృష్ణ

మోటూరి వేంకటరావు

చక్రవర్తి రంగస్వామి

రమాకాంత్

అనుముల కృష్ణమూర్తి

విశ్వనాథ సత్యనారాయణ

618, సుల్తాన్ బజార్, హైదరాబాదునుండి జువ్వాది గౌతమరావుచే ప్రకటితము. ఫోన్ : ౪౬౧౬
అజంతా ప్రింటర్సు, సికింద్రాబాదు.